1955 — 56

# శ్రీ అరుణ ప్రచురణలు :

సంపాదకుడు :

కంభంమెట్టు సత్యనారాయణరావు

ఆంధ్ర గ్రంథాలయ ప్రెస్ :: విజయవాడ-2.

అవి పుష్యమాసపురోజులు. సంధ్యవేళ సరిగా భవానీ పూర్ ఠాణాకు ఎదురుగా అతడు కాళీఘాటు ట్రాముదిగాడు. బాదామీ రంగు శాలువా పైన కప్పుకున్నాడు. కాళ్లకు మేజోళ్లు, వాటిమీద పంపుషూ తొడుక్కున్నాడు. క్రాప్ ఆల్బర్ట్ ప్యాషన్‌లో కత్తిరించిఉంది. చేతిలో వెండి పొన్ను బెత్తము మెరుస్తోంది. అతడి వయస్సు ఇంచుమించు ముప్పయి ఏళ్లు ఉంటుంది.

పది నిమిషాలు అక్కడ నుంచుని అటూఇటూ చూస్తూ అక్కడనుంచి ముందుకుసాగి ఒక పెద్దభవనంముందు ఆగాడు. గుమ్మం లోతట్టున దర్వాను అగుపించగా అతణ్ణి పిలచి 'బాబు గారు ఉన్నారా?' అని అడిగాడు.

తన పొడుగుబాటి గడ్డాన్ని చేతితో నిమురుకుంటూ వచ్చిన వ్యక్తికేసి ఎగాదిగా చూస్తూ 'లేరు!' అన్నాడు.

'ఎక్కడకు వెళ్లారు?' అని మళ్ళీ అడిగాడు ఆవ్యక్తి. అతని ఈ ప్రశ్న దర్వాన్ వినిపించుకున్నట్లు లేదు. దగ్గరలో ఉన్న పాకశాల వరండాలో కూర్చుని రొట్టెలు చేస్తున్న మహారాజ్ (వంటవాడు) తో భాతాఖాని వెయ్యటానికి వెళ్ళిపోయాడు. గొప్పవారి యిండ్లకు తరుచు వచ్చేవారు స్వంతం కాకపోయినా అద్దెమోటారుల మీదగాని లేకపోతే ఏదైనా బండిమీదగాని రావటం కద్దు. అలాటివారిని చూస్తే ఈ దర్వాన్లు లేచి నిలబడి వినయవిధేయతలతో నమస్కారాలు

చేస్తూ ఉంటారు. కనీసం బాడుగబండ్లమీద వచ్చినవారికైనా యీ మర్యాదలు జరుగుతుంటాయి. ఈలా కాలి నడకని వచ్చిన వారంటే అట్టే లక్ష్యముంచరు.

ఈ వచ్చినబాబు మరికొంచెం సేపాగి, ఏమయ్యా 'అయ్యగారు ఎక్కడ ఉన్నార'ని వెనుకటికంటె నెమ్మదిగా అడిగాడు. ఈతడి ఈవాలకం చూచేప్పటికి దర్వాన్ మెత్త బడ్డాడు.

'బాబుగారు వూరుబయట షికారు చేసేందుకు వెళ్ళి వున్నారు. బాబుగారితో ఏమైనా తమకు తొందర పని ఉన్నదా' అని అడిగాడు.

'అవును' అన్నాను.

'మీ పేరు?'

'ఎందుకులే! మీ బాబుగారు నన్ను బాగా ఎరుగుదురులే' అన్నాను.

'లోపల కూర్చుందురుగాని రండి' అని నాకు లోపలికి దారి చూపించుతూ ముందుకు నడిచాడు. ముందు ఉన్న గోటుదాటి లోతట్టున మేడక్రింది వసారాలోకి వచ్చాము. వసారాకు ఒకవైపున ఒక పెద్దగది రెండవవైపున మేడపైకి పోయేందుకు మెట్లు ఉన్నాయి. వసారాలో నేను కూర్చునేందుకు దర్వాన్ గదిలోనుంచి ఒక కుర్చీ తెచ్చివేశాడు. నేను అందులో కూర్చుంటూ 'బాబుగారు యిప్పుడప్పుడే రారా?' అని అడిగాను.

'ఎందుకు రారు. వారు వచ్చే వేళయింది' అన్నాడు. ఇంతలో ఎవరిదో పిలుపు విని వాడక్కడనుంచి వెళ్ళిపోయాడు.

పదిపదిహేను నిమిషాలు దాటింతరువాత గృహాయజమానితో తిరిగివచ్చాడు. కూర్చుని ఉన్న నన్నుచూచి ఆయన 'ఎవరు?' అని ప్రశ్నించాడు.

సన్నని గొంతుకతో 'నే నే!' అన్నాను. నేను. ఆ మసగచీకటిలో నన్ను గుర్తించినట్లులేదు. ఎవరా? అన్నట్లుగా నా మొహంవంక తేరిచూడసాగాడు. వెంటనే నేను గ్రహించుకుని 'నేనే! మోహన్. గుర్తుపట్టలేదా?'

'ఓ! నువ్వా మదన్- రా! రా! ఎంత సేపయింది నువొచ్చి?'

'ఇంతకుముందే.'

'పద పైకిపోదాం.' అంటూ నాచెయ్యి అంది పుచ్చుకుని పైకి తీసుకువెళ్ళాడు. విద్యుద్దీప కాంతితో గదంతా ప్రకాశిస్తోంది. విలువైన అనేక వస్తువులతో ఆగది అమర్చబడి ఉంది. నన్ను తీసుకువచ్చి ఒక సోఫాలో కూర్చోపెట్టి తనూ నా ప్రక్కనే కూర్చున్నాడు. ఇంతలో ఒక నౌకరువచ్చి ఆతని కాలిజోళ్ళు విప్పి, స్లిప్పర్లు తొడిగి, నెత్తిన ఉన్న టోపీ తీసి వంకినపెట్టి వెళ్ళిపోయాడు.

'నువ్వు చాలారోజులయిందనుకుంటాను యిక్కడకు వచ్చి మదన్- బహుశా నన్ను మరిచిపోయావేమో ననుకున్నాను. రెండుమూడు సంవత్సరాలయి ఉంటుందనుకుంటాను నువ్విక్కడకు రావటంమాని. అప్పుడు కాళీఘాట్‌నుంచి వెళ్ళిపోతూ నీ భార్యాబిడ్డలను యిక్కడకు తీసుకువచ్చావు అదే ఆఖరనుకుంటాను. అమ్మాయి కులాసాగా ఉందా?'

'ఆ కులాసాగానే ఉంది. దాని తరువాత యిప్పుడొక మొగపిల్లవాడు కూడాను.'

'బాగుంది. పిల్లవాడి వయస్సెంత ?'

'రెండేళ్ళు'

'ఈ సంగతి నాకు తెలవనే తెలవదు. ఒకప్పుడు రోజుకొకసారైనా ఒకర్నొకరం చూచుకోకుండా ఉండేవారమే కాదు. అలాంటి దిప్పుడు ఈలాంటి సంతోష సమయాల్లోకూడ జ్ఞాపకంరాని స్థితిలో వున్నాము. ఈ ఇంట్లో మనం ఆడుకున్న ఆరోజుల్లో ఎంతఅల్లరిచేసేవాళ్ళం' అంటూ మోహన్ బిగ్గరగా నవ్వసాగాడు. మదన్ కూడా అతనితో పాటు నవ్వుతూ. ఔను ఆరోజులు పోయాయి. ఇవాళ మీ దర్వానుచేత 'మీ పేరే మిటి' అని అడిగించుకోవలసి వచ్చిందికూడా !'

'నిజమే ! ఇందులో వాడి తప్పేముంది. నువ్వు చాలా కాలంనుంచి ఇక్కడకు రానేరావటంలేదు. వాడు ఈమధ్యనే ఒక సంవత్సరమయింది నౌకరీకి కుదిరి. పోనీలే. నీభార్య కులాసాగా ఉన్నదా ! టీ పుచ్చుకోవూ ?' అంటూ నౌకర్ని టీ తెమ్మనమని పురమాయించాడు. రెండు నిమిషాల్లో టీ తెచ్చి నౌకర్ అందించాడు. ఇద్దరూ నిశ్శబ్దంగా తాగుతూ కూర్చున్నారు. కొంతసేపయాక మోహన్.

'ఇప్పుడుకూడా నువ్వలాగే తాగుతున్నావా? మదన్'

మదన్ సిగ్గుతో తలవంచుకొని అలాగే కూర్చున్నాడు.

'చూడు! మదన్. పిల్లా-జెల్లాకూడా కలిగాయి. సరే!

ఇదివరకు జరిగిందేదో జరిగిపోయింది; యీ దిక్కుమాలిన త్రాగుడు యికనైనా మానెయ్యి. అలా ఒక్కసారిగా మాని వెయ్యటం సాధ్యం కాకపోతే నెమ్మదినెమ్మదిగా మానెయ్య కూడదు ?'

మదన్ వ్యాకులదృష్టితో చూస్తూ 'నాకు మానెయ్యటం ఇష్టంలేదనేగా నీ ఉద్దేశ్యం? ఎంత ప్రయత్నించినా మానెయ్య లేకుండా ఉన్నాను మోహన్. ప్రతియేడూ మూడుసార్లు వట్టు వేసుకున్నా దాన్ని ముట్టుకోకుండా ఉండలేకున్నాను. నా పుట్టినరోజు పండుగనాడు, ఇంగ్లీషుసంవత్సరాదికి, మనసంవత్స రాదికికూడా ఒట్టుపెట్టుకుంటున్నాను. అలా ఒట్టుపెట్టుకున్న ఏ కొద్దిరోజులవరకో దాని జోలికి పోకుండా ఉండగలిగేవాణ్ణి. ఆతర్వాత చూడు ఏదో శనిదేవత-' అంటూ మదన్ తల వంచుకున్నాడు.

మళ్ళా కొంతసేపటివరకూ ఎవరూ మాట్లాడలేదు. మోహన్ ఆ నిశ్శబ్దతను భేదిస్తూ కొంతసేపటికి 'చూడు! మదన్. త్రాగుడు మానెయ్యాలంటే ఒట్టుపెట్టుకున్నంత మాత్రాన ప్రయోజనంలేదు. త్రాగుబోతుల సాంగత్యాన్ని పూర్తిగా ముందు మానివెయ్యాలి. లేకపోతే లాభంలేదు' అన్నాడు.

'తప్పకుండా అలాచేస్తాను. ఇప్పుడు వారంరోజుల నుంచి ఆ చాయలకే పోవటంలేదు. కాని యిలా ఎప్పుడూ ఉండగలుగుతాననే నమ్మకంమాత్రం కలగటంలేదు. నా యీ దౌర్బల్యాన్ని గురించి అప్పుడప్పుడూ నాలో నాకే చాలా విచారంకూడా కలుగుతూఉంటుంది. రోజులో చాలా

పర్యాయములు టీ త్రాగుతూఉంటాను. ఇప్పుడు టీ త్రాగి తరువాత మనస్సెంతో ఆహ్లాదంగా ఉంది. ఒకమూల కొంప మునిగిపోతోంటే యింకా ఈ త్రాగుడు మానకపోతే ఎలా?'

'అంటే?'

నా యిళ్ళు మూడింటిని వెనక నెప్పుడో ఒక పెద్ద మనిషికి తాకట్టుపెట్టాను. ఆ పెద్దమనిషి ఇప్పుడా పైకం అసలుఫాయిదాలు దేఖీలూ ఒక మాసంరోజులలోగా తనకు చెల్లించకపోతే ఇళ్ళను మూడింటుని తను భుక్తపర్చుకుంటా నని నాకు నోటీసు యిచ్చాడు.

మోహన్ విచారసూచకంగా 'అసలూవడ్డీ కలసి ఎంత మొత్తమివ్వవలసి ఉంటుంది?'

'ఇరవైవేలకు పైగాఉంటుంది.

'అబ్బా - యిదంతా ఈ రెండుమూడేండ్లలోనూ నువ్వుచేసిన అప్పేనా?'

మదన్ దానికి జవాబేమీ ఇవ్వలేదు. కొంచెంసేప యూక 'మోహన్ ఇంకొక కప్పు టీ తెప్పించుదూ మనస్సు చికాకుగాఉంది!' నౌకర్ను పిలిచి కప్పు టీ తెమ్మని మదన్‌ను చూచి 'అప్పును గురించి ఏమాలోచించావు? అన్నాడు మోహన్.'

వణుకుతున్న గొంతుకతో మదన్ తల వంచుకుని 'ఏమున్నది?_ నీమీద ఆశపెట్టుకువచ్చాను. మూడేళ్ళనుంచి యిటురానివాడిని, ఇందుకొరకే ఇప్పుడు వచ్చాను. చిన్న

నాటినుంచి నేను చేసిన ఎన్నో తప్పులను సహించి క్షమించావు. ఈ తడవకూడా నీవే నాకు దిక్కు. పుణ్యంకట్టుకుని నాకు అప్పు యిచ్చినట్లయితేనే నా యిల్లు నాకు దక్కుతవి. లేకుంటే నేను పిల్లాజల్లాతో సహా ఏ చెట్టో పుట్టో పట్టుకు పోవాల్సిఉంటుంది.' అన్నాడు.

అతని అవస్తను చూడలేక మోహన్ తన ముఖము నింకొక వైపుకు త్రిప్పుకున్నాడు. ఇంతలో నౌకరు టీ తెచ్చి అక్కడపెట్టి వెళ్ళిపోయాడు. దాన్ని తీసుకుత్రాగుతూ మదన్ ఓరకంట తన మిత్రుని ముఖభావాల్ని గ్రహించ ప్రయత్నించాడుగాని మోహన్ ఏమీ ఎరుగనివానిలాగా నటించాడు!

'ఏమంటావ్ మోహన్, నాకు పయికం పూరికే యివ్వమంటంలేదు! సబబయిన వడ్డీకి వాటిని నువ్వే తనఖా వ్రాయించుకుని పయిక మిప్పించు.

'ఒకచోట గొయ్యితీసి, ఇంకొకచోట గోతిని పూడ్చినందువల్ల వచ్చే లాభమేమిటని, అంతకంటె మంచి సలహా ఏమిటంటె, ఆ అద్దెకు యిచ్చిన యిళ్ళను అమ్మివేసి ఆ పయికంపెట్టి ఋణం తీర్చివేస్తే మంచిది.

'అలాకాదుమోహన్! అద్దెకు యిచ్చిన ఆ యిళ్ళు అమ్మివేస్తే ఋణం తీరుతుందన్నమాట వాస్తవమే. పైగా అప్పుపోను కొద్దో గొప్పో మిగులుతుంధికూడాను. కాని ఏం లాభం? ఆ యిళ్ళమీద వచ్చే అద్దెలతోటే ఇన్నాళ్ళబట్టి జీవిస్తున్నాం. ఎలాగో యీ అప్పుకాస్తా తీరినితరువాత మళ్ళీ మా పూర్వపు వ్యాపారం చేద్దామనివుంది నాకు. నాన్నగారు

ఈ వృత్తివల్లనే నెలకు వెయ్యి పదిహేనువందల రూపాయల వరకు సంపాదిస్తూఉండేవారు. ఈ సంగతిని నాన్నగార్ని ఎరిగున్న నలుగురితోనూ చెపితే, వాళ్ళు చాలా సంతోషించి, ప్రోత్సాహమిస్తామన్నారు. నువ్వే చెప్పు మోహన్ ఎప్పటికి ఏది ఎలాజరుగుతుందో? ఎవరుచెప్పగలరు. ఆ అద్దెకిచ్చే ఇళ్ళు రెండూ పోగొట్టుకుంటే పిల్లలగతి యేంకావాలి? ఆ యిళ్ళు రెండూ ఉన్నంతకాలం ఎవరినీ దేనికీ యాచించవలసిన అవసరం ఉండదు. నాన్నగారిచ్చిపోయిన రొఖం యీనత్తూ ఖర్చు జేసేశాను. ఇంక యీ యిళ్ళుకూడా పోగొట్టుకుంటే నేను, పెళ్ళాం పిల్లలూ యేంగావాలి? మమ్మల్ని ఆదరించేవాళ్ళెవరున్నారు?' అన్నాడు.

'నిజమే!' అని వ్యాకులపాటు పొందినవాడివలె అటు ఇటూ చూడసాగాడు. ఏమంటావు? ఆఁ! డబ్బా! అని మోహన్ తిరిగి గడియారంవైపుచూచి, గోడవైపునఉన్న డ్రాయరు తెరచి, వెతికి, ఒక ఉత్తరం తీసి శ్రద్ధతో చదవసాగాడు. పూర్తి కాగానే నౌకర్ను పిలచి, 'గులాబ్‌రాయి సేటుగారింటికి విందుకుపోవాలి. కోచ్‌మాన్‌ను బండి కట్టమనిచెప్పు' అన్నాడు.

మోహన్ తనకేమీ జవాబివ్వకపోవటం చూచి 'ఏమంటావ్ మోహన్. ఉన్న రెండిళ్ళను అమ్మేసి, అప్పుతీర్చి మిగిలిన డబ్బుతో ఒకఏడాది కాలక్షేపంచేసి, తరవాత కడుపు మాడ్చుకోమనా. నువ్వు చెప్పేది?'

ఇటువైపు చూడకుండానే మోహన్ అన్నాడు. 'ఎన్ని రూపాయిలు కావాలంటావు?'

'ఇరవై యొక్క వెయ్యి అప్పు తీర్చేందుకు, మరి నాలుగువేలు వ్యాపారం చేసుకునేందుకు, మొత్తం ఇరవై ఐదువేలు కావాలి.'

'ఊఁ' అని మళ్ళీ మోహన్ ఊరుకున్నాడు.

'చిన్నప్పటినుంచీ మనం స్నేహితులం. నువ్వు ఈ మాత్రం ఉపకారమన్నా చెయ్యకపోతే ఎలాగు? నీకు బ్యాంకిలో లక్షలకొద్ది రూపాయలు మూలుగుతున్నాయి. బ్యాంక్ వడ్డీ ఆట్టేరాదు. మాషావుకారు నూటికి సం॥ పన్నెండు రూపాయలు కాంపౌండు వడ్డీ తీసుకుంటున్నాడు. అదే వడ్డీ మీద యియ్యి. నువ్విచ్చిన మొత్తంకు కాంపౌండు వడ్డీతో పదేళ్ళవరకు అయిన మొత్తంకన్నా నా మూడిళ్ళ ఖరీదు ఎక్కువే చేస్తుంది. ఏమంటావు.'

దానికి మోహన్ జవాబేమీ చెప్పలేదు. నౌకర్ను భోజనానికి వెళ్ళేటప్పుడు ధరించే డ్రస్ తీసుకురమ్మని ఆజ్ఞాపించాడు.

మోహన్ ప్రవర్తనపట్ల మదన్‌కు కొంచెం కష్టం కలిగింది. ఏదో ఒకటి తేల్చుకోవాలని నిశ్చయించుకున్నాడు. 'చూడు మోహన్. నీ ఆలోచన నాకు అర్థమయింది. నాలాంటి దుబారా ఖర్చులుచేసే మనిషికి అప్పిస్తే మళ్ళీ ఎలా వస్తుందనేగా? ఇల్లూ వాకిలీ వేలంవేయిస్తే బాగుండదు. పైని లోకులు 'బాల్యమిత్రుడి ఇల్లూవాకిలీ దయాదాక్షిణ్యాం లేకుండా వేలం వేయించాడని' నలుగురూ నాలుగు మాటలంటారనేనా నీ అలోచన. అంతేగా. అలాగేమీ ఆలోచించకు. ఈ మూడుయిళ్ళూ అయిదు సంవత్సరాలు గడువుపెట్టి

నీకు తాకట్టు వ్రాస్తాను. అయిదేళ్ళలోగా అప్పంతా తీరుస్తే యిళ్ళు నాకు తిరిగి యిచ్చివేద్దువుగాని. లేకపోతే యివి నీకు చెందేటట్లుగా షరతుపెట్టి కాగితంవ్రాసి యిస్తాను. ఇది నీకు సమ్మతమేనా. వేరే కోర్టుకు పోనవుసర ముండదు. అని అడిగాడు.' ఇంతలో నౌకరు మోహన్‌కు బట్టలు తెచ్చాడు. ఇంకొంచెంసేపు వాణ్ణి ఉండమన్నాడు.

'బండి సిద్ధంగా ఉంది బాబూ !'

'ఇంకా అరగంట టైముంది, కొంచెం ఉండి వెళతాను. అని యేదో ఆలోచించసాగాడు.

మోహన్ వైకరిచూస్తే మదన్‌కు మళ్లీ కొంత ఆశకలిగింది. తరువాత అతడు వెళ్లేవరకూ ఇద్దరూ ఈ విషయంమీదే మాట్లాడుకున్నారు. చివరకు మోహన్ అప్పు ఇవ్వటానికి వప్పుకున్నాడు.

'మోహన్ నాకు వ్యాపారంలో వచ్చే లాభంతో యీ అప్పు తీరుస్తాను. ఇంటి ఖర్చు అద్దెలతో వచ్చే అయివేజుతో వెళ్ళిపోతుంది. ఏదోవిధంగా మూడు సంవత్సరాలలో ఈ అప్పు అంతా తీర్చివేయవచ్చునని నా నమ్మకం. అలా జరగకపోతే యింకా అప్పటికి రెండేళ్లు ఇంకా గడువు ఉంటుంది. నాకు యిప్పటికి బాగా తెలిసివచ్చింది. ఇకనుంచి మద్యాన్ని గోరక్తముగా భావిస్తాను. దాని వాసనకూడా చూడను సరిగదా ! ఆ అంగళ్ళు ఉండేదారిని కూడా నడవను. చూడు మోహన్ ఇంకొంచెం టీ ఉంటే తెప్పించు.

* * * *

ఒక వారం రోజుల్లో రాతకోతలన్నీ పూర్తయి తనఖా దస్తావేజుకూడా రిజిష్టరయింది.

# 2

అయిదు సంవత్సరాలు గడచిపోయిన తరువాతమాట. బౌబజారునందలి ఒక వీధిలో పురాతనమైన రెండస్థుల మేడ ఒకటి ఉంది. ఇదే మదన్ తండ్రి తాతలు నివసించిన యిల్లు.

అది పుష్యమాసము. ఉదయం తొమ్మిది గంటలయి ఉంటుంది. పై అంతస్తులో ఉన్న ఒకగదిలో సిధిలావస్తలో ఉన్న ఓ మంచంమీద జీర్ణావస్తలో ఉన్న పరుపొకటి వేసి ఉంది. జబ్బుతో ఉన్న కొడుకును ఒళ్లో పెట్టుకుని దానిమీద కూర్చునిఉంది మదన్ భార్య చంపావతి. ఆ ప్రక్కనే దుప్పటి కప్పుకుని తొమ్మిదేళ్ళ బాలిక అటూ యిటూ పచార్లు చేస్తోంది. మధ్యమధ్య ఆమె తల్లిని 'తింటానికేమైనా పెట్టమని' అడుగుతోంది.

ఆ గదిలో పరిస్తితులుచూస్తే అందులో నివసించేవారి మీద జాలిపుడుతుంది. పేరుకు ఆమె 'చంపావతి' అయినప్పటికీ యిప్పటి స్తితిలోమాత్రం ఆమె శరీరం నల్లటి కావుతో కప్పబడి ఉంది. ప్రస్తుత మామె వంటిని ఏనగలూ లేకపోయినప్పటికి నిన్న మొన్నటిదాకా విలువైన నగలెన్నో ధరించిన ఆనవాళ్ళు యింకా కనుపించుతూనే ఉన్నాయ్.

బాలిక క్రమక్రమంగా ఏడవసాగింది. తల్లి ఆమె కన్నీటిని పమిటకొంగుతో తుడిచి ఓదారుస్తూ 'ఛీ! ఏడుస్తారా! తప్పు. ఎవరైనా చూస్తే నవ్వుతారు. ఈపాటికి మీ నాన్నగారు వస్తూ ఉటారు. ఊరుకో.'

బాలిక ఏడ్పుమాని మళ్ళీ కొంతసేపటి వరకు ఓర్చుకొకుంది. అప్పటికీ తండ్రి జాడలేదు. మధ్యమధ్య రోడ్డువైపు కిటికీవద్దకు పోయి చూపు ఆనినంతవరకు తండ్రి రాక నిమిత్తం చూస్తూనే ఉంది. ఎన్నిసార్లుచూచినా ఆమెకు నిరాశే కలిగింది. పదిగంటలైనా తండ్రిజాడ కనుపించలేదు. ఆమె ఆకలికి ఆగలేకపోతోంది. తల్లిదగ్గరకు వచ్చి 'అమ్మా ఈ ఆకలికి ఆగలేనే! నాన్న ఇంకా ఎప్పటికి వస్తారే?' అని జాలికలిగేటట్లు ఏడుస్తూ అడిగింది.

'వచ్చే వేళయిందమ్మా! అద్దె వసూలుచేసుకు రావటానికి వెళ్ళారు. వచ్చేటప్పుడు సరుకులు అవీ తెస్తారు. వాటితో బాటు తినేందుకు నీకూ తమ్ముడికి కూడా ఏమన్నా తెస్తారు. ఈపాటికి వస్తూనే ఉంటారు' అంది తల్లి.

'పోనీ నీదగ్గర కానీ ఉంటే యియ్యమ్మా మిఠాయి కొనుక్కుంటాను?'

'ఉంటే యిప్పటివరకు నీ కివ్వకుండా ఉంటానా తల్లీ!' అని కంట తడిపెట్టుకుంది. ఈ ఇంటి పరిస్థితులు ఈనాటి కీవిధంగా ఉన్నాయి. ఆకలితో ఉన్న పిల్ల ఒక్క కానీపెట్టి చిరుతిండికి కొనుక్కునే స్థితికూడాలేని గతిపట్టింది. కాని రెండు సంవత్సరాలకు పూర్వం ఈ పాప తన పెంపుడుకుక్క 'టామీ' నోటి నిండా రసగుల్లాలు కుక్కి తినిపించేది. ఎంతలో ఎంతమార్పు!

తల్లి కళ్ళు చెమ్మగిల్లటం పాపమాపాప చూచింది. కంగారుపడింది. ఏమి తెలుసుకుందోగాని వెంటనే 'వద్దులేవే అమ్మా! మిఠాయి వద్దు అది తింటే నాకు అజీర్తి చేస్తుంది. నాన్నగారు వచ్చేవరకు ఏడవకుండా ఉంటానుగా!' అంది.

* * * *

అయిదు సంవత్సరాల క్రితం మదన్ తన స్నేహితుడి వద్ద యిరవై అయిదువేల రూపాయలు అప్పు తెచ్చాడు. అప్పటికి తనకున్న అప్పులు తీర్చగా మిగిలిన సొమ్ముతో వ్యాపారం సాగించాడు. ఒకటి రెండు నెలలు సాగేప్పటికి మళ్లీ వెనుకటి ఈతని త్రాగుబోతు స్నేహితులంతా క్రమంగా ఇతణ్ణి ఆశ్రయించారు. ధనవంతులు త్రాగేది 'సారాయి' కాదనిన్నీ, 'బీరు - విస్కీ' మొదలైనవి విదేశీయ పానీయము లనిన్నీ, మద్యముక్రింద రాదనిన్నీ సలహాలనిచ్చారు. పైగా అది త్రాగినందువల్ల ఈతడి ప్రతిజ్ఞకు భంగం రాదనికూడా నచ్చచెప్పారు. ఏవిధంగానైతేనేమి మొదటి సంవత్సరము పూర్తి అయేలోపలే మదన్ ఇల్లు విదేశీసారాయి ప్యాకింగు కేసులతో నిండిపోయింది. ఆ యింటి నౌకరు వీరుపయోగించిన సారాయితాలూకు కాళీసీసాల నమ్మగా వచ్చిన పయికముతో తన భార్యకొకటి రెండు చిన్న బంగారు నగలను చేయించుకున్నాడు. మొదటి సంవత్సరము వ్యాపారములో కొంత లాభము వచ్చినప్పటికి ఒక్కపైసాకూడ అప్పుకు జమ కట్టబడలేదు.

రెండవ సంవత్సరము త్రాగుడు మితిమీరిపోవటం మూలాన వ్యాపారంలో వచ్చిన లాభంతోపాటు పెట్టుబడి కూడా వమ్మయిపోయింది. చేత డబ్బు లేనందువల్ల చాల రోజులవరకు విదేశ మద్యమును బహిష్కరించాడు. ఎవరైనా స్నేహితులు అడిగినప్పుడు 'విదేశీ సారాయిలకంటె దేశీయ మద్యమే చాలా మంచిది. ఆరోగ్యకరమైనదని' శ్రీరంగ నీతులు చెప్పసాగాడు. ఈ స్వదేశీ వ్రతము కొందరిపట్ల ఎల్లప్పుడూ ఒకేమాదిరిగా ఉండదు. చేతనిండుగా డబ్బు

లేనప్పుడు వీరిది దేశీయతత్వము. మస్తుగా డబ్బు చేజిక్కిన విదేశీయతత్వము! ప్రస్తుత మాలాటిదే ఈతని దేశీయ వాదన.

యింతవరకు తన రెండు యిళ్ళమీద వచ్చే అద్దెతో కుటుంబము ఖర్చులు వెళ్ళిపోతున్నాయి, అందులో ఏమీ మిగిలేదికాదు. తన పైఖర్చులకు త్రాగుడుకు, ఉంగరాలు, గడియారము, దానిగొలుసు, శాలువాలు, తివాచీ ఒకటే మిటి చివరకు వెండిపొన్ను వేసిన చేతికర్రకూడా అమ్ముకున్నాడు. ఇవిమట్టుకు ఎన్నాళ్ళనివస్తాయి? తరువాత బీరువాలు, డ్రాయర్లు, మంచి మంచి లాంపులు మొదలైన వస్తువులు అమ్ముకుంటూ మూడవసంవత్సరం గడుపుకున్నాడు.

నాల్గవ సంవత్సరంలో అతని చూపు భార్య నగల మీదకు పోయింది. అడిగినప్పుడు యివ్వకపోతే ఆ మహా ఇల్లాలిని హింసించి, ఒకొక్క వస్తువునే ఊడ్చిపెట్టాడు. వీటితో అయిదవసంవత్సరంకూడ నడిచింది.

ఇప్పటికి రెండువారాలనుంచి మదన్ త్రాగుడు మానివేశాడు. భార్యనెత్తిన చెయిపెట్టి త్రాగనని ఒట్టు వేసుకున్నాడు. నెల మొదటిరోజునే ఇళ్ళ అద్దెలు వసూలుచేసి యింటికి కావలసిన పప్పు ఉప్పు మొదలైన సామగ్రి నెలకు సరిపడ ఒకేసారి తెస్తూఉండేవాడు. అందువల్లనే నిన్నరాత్రి వరకు యింట్లో ఏకొరతా లేకుండా గడచిపోయింది. కాని, యివ్వాళ మదన్ సామాన్లు తీసుకొచ్చేటంతవరకు పొయ్యి అంటించే వీలుకనబడలేదు.

తాణాలోని గంట పదకొండుమాదులు మ్రోగింది. పనిమనిషి ఇంట్లో వీరితాత తండ్రులనాటినుంచి పనిచేసేది ఆ విశ్వాసంవల్ల యిప్పటివరకు వీరినే అంటిపెట్టుకుఉంది. 'అయ్యగారి జాడ యింతవరకూ లేదు. పొయ్యి అంటించమం టారా అమ్మా? అంది.

'వారు వచ్చినతరువాతనే అంటించవచ్చులే' అంది.

'అలాగానే! అయ్యగారికి యింత ఆలశ్యం ఎక్క డయిందో? 'మాలంగా' 'కోటాతొలా' ఇక్కడికి నాలుగు మైళ్ళు పయిగాఉంది. నాకేదో సందేహంగాఉంది. ప్రొద్దు టనగా వెళ్ళినమనిషి ఇంతవరకు రాలేదు. చేతినిండా పయికం ఉంటుంది. ఆ దగ్గరలోఉన్న దుకాణాలలో దేనిలోనూ మళ్లీ దూరలేదుగదా? అదేనిజమయితే వారిప్పుడురారు. నాకు తెలుసు. తెల్లారగట్ల ఏ రెండో-మూడో అవుతుంది.' అంది. చంపావతి మనస్సుకు కూడా ఈ సందేహమే తోచింది. కాని బయటకు వెలిబుచ్చకుండా

'అః. అలాజరుగదు.'

ఆలాచేస్తే వారు వచ్చేటంతవరకు పిల్లలు వస్తుండా లన్న సంగతి వారికి తెలియదంటావా?' అంది.

'అబ్బాయిగారికి ఎలా ఉందమ్మా?'

'తొందరేమీలేదు. నిద్దరపోతున్నాడు!'

'అయితే నేను పొయ్యి అంటించివచ్చి అబ్బాయిని చూస్తూఉంటాను. ఇంతలో మీరు స్నానంచేసి...' అని వదన్నా తీసుకోమందామని చెప్పబోయింది. ఇంతలో ఇంట్లో

యేమీలేదన్న సంగతి జ్ఞాపకానికివచ్చి మధ్యలోనే అనేమాట ఆపివేసింది.

ఆలశ్యం అయినకొద్దీ ఆమెకు మనసులో ఆరాటం ఎక్కువకాసాగింది. పిల్లవానిని మంచంమీద పడుకోబెట్టి కిటికీ వద్దకుపోయి భర్త వచ్చేదారివేపే చూస్తూఉండిపోయింది. అలా ఆమె ఆట్టేసేపు చూడవలసిన అవుసరం లేకపోయింది. దారి వెంట తూలుతూ, పడుతూ వస్తూన్న మదన్ ఆమెకంట పడ్డాడు. ఉదయం ఇంటినుంచి వెళ్ళేటప్పుడు మీదవేసుకు వెళ్ళిన కండువాకూడా ఇప్పుడు లేదు. ఈ పరిస్థితి చూడ గానే ఆమెకు అపరమితమైన దుఃఖం కలిగింది. శరీరం ఆపాద మస్తకం వణకసాగింది. క్రింద పడిపోతానేమో అనేభయంతో ఆమె కిటికీచువ్వలు గట్టిగా పట్టుకుని అక్కడే అలా నిలబడి పోయింది.

మదన్ తూలుతూ పడుతూ కృత్యాద్యవస్థతో మెట్లన్నీ ఎక్కి మేడమీదకు వచ్చాడు. వచ్చేరావటంతోటే జేబులోనుంచి గుప్పెటితో రూపాయిలు చిల్లరతీసుకు నేలమీద విశిరికొట్టి, తడబడుతున్నమాటలతో 'ఇవిగో-ఇవి తీసుకో - పనిమనిషిని బజారుకు పంపించు, నేను పడుకుం టాను.' అని ముందుకు అడుగువేయబోయి తూలి క్రిందపడి పోయాడు. అతడా పడటం ఒక గాజుగ్లాసుమీద పడ్డాడు. అది పగిలిపోయి ఒక పెద్దముక్క అతని తలకి పెద్ద గాయాన్ని చేసింది. గాయంనుండి రక్తం అమితంగా కారుతోంది. ఈ తాగుబోతు భర్త పరిస్థితి చూచిన చంపావతికి మనస్సు వికలితమై పోయింది. వెంటనే ఆ దుఃఖభారంతోటే అతని

ప్రక్కను నేలమీదకూర్చుని, పతి తల తన తొడమీదకు తీసుకుని పాపని ఒక గ్లాసుతో నీరు తెమ్మని ఆ తెచ్చిన నీటితో భర్తగాయాన్ని కడిగి కట్టుకట్టింది. పాప విశనకర్రతో విసరసాగింది. అతడికి స్పృహ లేకుండాపోయింది.

తల్లి - కూతుళ్ళు ఈవిధంగా ఉపచారాలు చేయగా అరగంటకుపైనగాని అతను కండ్లు తెరవలేకపోయాడు. మెల్లిగా కళ్ళు తెరచి, తనకు ఉపచారాలను చేసే భార్యాపుత్రికలను చూచి—'తాగుబోతు భర్తకు ఉపచారాలు చేస్తున్నావా చంపా ?' అని ప్రశ్నించాడు.

చంప ఏడుస్తూ—'నామీద ఒట్టువేసుకుని మళ్లా ఎందుకు త్రాగారు ?'

'చంపా !'-

'ఆఁ !- ఏమిటీ !'

'ఎవరిపైనైనా ఒట్టువేసుకుని, అలాచేయకపోతే ఏమవుతుంది ?'

'ఎవరిపైనైతే ఒట్టువేసుకుంటారో వాళ్లు చనిపోతారు!- అందుకని నేను చచ్చిపోతాను.

'అలాకాదుచంపా అందుకనే నేను ఇవాళ త్రాగి వచ్చాను. నువ్వు ఒక్కర్తివే చావవు. నువ్వు - నేను, అమ్మాయి, అబ్బాయికూడా చచ్చిపోతాము !'

భర్తనోటిని తన చేత్తో మూస్తూ, తప్పు అలా అనరాదు. మీరు పడుకోండి. ఎవరమూ చచ్చిపోము !' అంది.

'కాదు చంపా, తప్పులేదు. నువ్వూ చచ్చిపోతావు. నేనూ చచ్చిపోతాను. అమ్మాయి పోతోంది. అబ్బాయి పోతాడు. తిండిలేక మనమందరం చచ్చిపోవాలిసిందే. ఒక కాబూలీవాడికి నా కండువా అయిదురూపాయలకు అమ్మి వేశాను. అందులో అర్థరూపాయిపెట్టి సారాయిత్రాగాను. మిగతా నాలుగున్నర ఇక్కడ పడేశాను. ఏవీ' అని క్రిందకు చూసాడు.

'దాసీది తీసి బజారుకు వెళ్ళింది, సామాన్లు తీసుకు రాను !'

'ఏరీ! అబ్బాయి - అమ్మాయి ?'

'వాళ్ళిద్దరూకూడా దాంతో వెళ్లారు. వాళ్ళకేమన్నా తినటానికి కొనిపెట్టి వంటసామగ్రి తెచ్చేందుకు వెళ్ళింది. బహుశా క్రింద పడుకొనిఉంటారు. లేవండి పక్కమీద పడు కుందురుగాని'

'లేస్తాను. కాని ఒకమాట. ఈ నాలుగురూపాయల న్నర ఉన్నంతవరకు మనకేమీ లోటురాదు. ఆపైన వస్తుంది ఆకలితో మలమల మాడి చచ్చిపోవలసిందే. పోయింది. అంతాపోయింది. అద్దెలు తెచ్చుకుందామని 'మాలంగా' వెళ్లాను. అద్దెకున్నవాళ్ళు ప్లీడరుగారిచ్చిన 'లాయర్ నోటీసు' చూపించారు. నాకు అందులో 'ఈ రోజునుంచి ఈఇళ్ళు మా క్లైయింటు అయిన శ్రీ మోహన్‌లాల్ పాఠక్ ఫలాన నంబరు డిక్రీలో వాదిగారికి చెందినవైయున్నవనిన్నీ, ఇకనుంచి అద్దెలు వారికేగాని మరెవరికీ చెల్లించరాదనిన్నీ' ఉన్నది. దాన్ని చూపించి అద్దెకున్నవాళ్ళు, ఇది నిజమేనా అని

నన్నడిగారు. నిజమేనని వాళ్లకు చెప్పి, అక్కడనుంచి 'కోటా తోలా' వెళ్లాను. అక్కడకూడా ఈ నోటీసే చూపబడింది. ఇక నాకు ఏమిచేయాలో తోచలేదు. తల తిరిగిపోయింది. బాగా నేజరిగిందని మనస్సులో అనుకున్నాను. కాబూలీవాడి దగ్గర ఆ ఉత్తరీయము అమ్మి అయిదురూపాయిలు తీసుకున్నాను. మనమంతా తిండిలేక మాడవలసిందేనని తలుపుకు వచ్చి మనస్సు చికాకుపడింది. ఆ స్థితిలో అర్ధరూపాయి యిచ్చి మనశ్శాంతి తెచ్చుకుందామని మద్యము పుచ్చుకున్నాను. నాకు ఇక శాంతిలేదు. త్రాగుబోతులు తమ సర్వస్వాన్ని కోలుపోగా, ఆలుబిడ్డలతో వీధులవెంట ముష్టెత్తుకోవలసి వస్తుందన్న లోకులమాటలు – మనపట్ల నిజమైంది కాదూ? చంపా!' అని కంటినీరు పెట్టుకున్నాడు మదన్.

భార్యపరిస్థితికూడా అట్లానేఉంది. కాని ఆమె సంబాళించుకుని, భర్తకన్నీరు తుడుస్తూ తప్పు – అలా జరగదు. ఇప్పటికయినా మించిపోయిందేమీలేదు. మీరు, మేము అందరం సుఖంగాఉంటాము. మీరు సన్మార్గాన్ని నడవండి మనకేవిధమైన లోటురాదు లేవండి. క్రిందనుండి లేచి ప్రక్కమీదకు పదండి. చొక్కా తడిసిపోతుంది. విప్పివేస్తాను.

మదన్ లేచి బట్టలు మార్చుకుని మంచంమీద కూర్చుంటూ 'చంపా! ఈ ఇంటినికూడా ఖాళీచేయమని నోటీసు వస్తుందేమో! ఇదికూడా అతనికి వ్రాసిఇచ్చిందే. ఇదికూడా ఖాళీచేయవలసివస్తే మనం ఏ చెట్టుక్రిందకో పోవలసి వస్తుంది' అన్నాడు.

'వద్దు. మీరు విచారపడకండి. అవసరమైతే మన వూరు వెళ్ళి అక్కడ ఉందాము.'

'మన ఊళ్లో ఇల్లు పాడుపడిఉన్నది. అక్కడకు వెళ్ళి మట్టుకు మనమేమిచేస్తాము. జరుగుబాటేముంది అక్కడ?'

'దీనికోసం మీరు విచారించవద్దు. ప్రపంచంలో అందరూ కలవాళ్లే ఉన్నారా? పరమేశ్వరుని రాజ్యంలో అందరకూ ఏదోవిధంగా జరుగుబాటు గలుగుతుంది. చూడండి! చెట్లమీది పక్షులు – నీటిలోని జలచరములు – అడవిలోని జంతువులు జీవించటంలేదూ? వాటిని కనిపెట్టి కాపాడుచున్న భగవంతుడే మనకు దారి చూపెడతాడు. తిండిలేకుండ ఎప్పుడూ పస్తుంచడు' అంది భర్తను ఓదారుస్తూ.

మదన్, భార్య చెపుతూన్నది కళ్ళుమూసుకువింటూ ఉండిపోయాడు. ఆమె చెప్పటం ఆగిపోయినా అలా కళ్ళు మూసుకుని కొంతసేపటివరకూ ఆలోచించి–'అయితే అలా చెట్లపై నివసించే పక్షులు, అడవిలో సంచరించే జంతువులు– కల్లుత్రాగేనిమిత్తం కట్టుకున్న భార్యమెడలోని పుస్తితోసహా నగలన్నీ అమ్ముకున్నాయంటావా?'.

'నిజమే. అవి అలా చేయలేవు–చేయవు. అయినా ఇప్పుడు మీకు ముంచుకుపోయిందేమీలేదు. ఇప్పుడైనా మీరు త్రాగుడుమాని సన్మార్గవర్తనులుగండి. భగవంతుడు మన కన్నీ సమకూర్చగలడు. అయిదుసంవత్సరములనుండి మిమ్ములను సన్మార్గవర్తనులనుగా చేయమని దైవమునుగూర్చి ప్రార్థిస్తున్నాను నా ప్రార్థన నిష్ఫలముగాదు. ఇన్ని కష్టములు పొందుతూన్నప్పటికికూడ అతన్ని నమ్ముకుంటే మనల నాదరించకపోడు. మరల మనకు మంచిరోజులు రాగలవు. దుఃఖ పడినందువల్ల ప్రయోజనములేదు. మీదుమిక్కిలి ఆరోగ్యము

చెడిపోవును. అన్నీ మరచిపోయి కొంచెం విశ్రమించండి. పని మనిషి వస్తున్నది. నేను వెళ్ళి వెంటనే వంటచేసి వస్తాను.'

'నాకు తలపోటుగాఉంది. నాకు నిద్రపట్టటంలేదు! తల తిరుగుతున్నట్లున్నది.'

'ప్రయత్నించి చూడండి. అమ్మాయి వస్తోంది. అది మీకు విసురుతూ కూర్చుంటుంది' అని తానే విసిన కర్రతో విసురుచూ రెండవచేత అతని తల మెల్లిగా వత్త సాగింది. మదన్ ఆ మోముఖముపై చూపు నిలపి కొంతసేపటికి ఆమె చేతిని తనచేతిలోకి తీసుకుంటూ అతి జాలికరమైన గొంతుతో 'చంపా!' అని పిలచారు.

'ఏమిటి!'

నిన్ను చాలా హింసించాను. అనేకసార్లు నీ పైచెయ్యి చేసుకున్నాను. ఆ పాపఫలం నే ననుభవించక తప్పదు అయినా ఎంతో భక్తిశ్రద్ధలతో నాకు పరిచర్య చేస్తున్నావు కదూ?'

'ఔను! తప్పకచేస్తాను. అలాచేయటంలో నా కానందం కలుగుతుంది!'అంటూ చంప భర్తనుదురు ముద్దు పెట్టుకుంది. ఆమె మృదుమధుర చుంబన స్పర్శవల్ల తాత్కాలికంగా అతని మనస్సుకు కొంత శాంతి లభించింది. అంతలో నిద్ర అతణ్ణావరించింది.

# 3

మహాదుర్భూముల వేళ మదన్‌కు ప్లీడరువద్దనుంచి నోటీసు అందజేయబడింది. అందులో నేటినుంచి ఈ యిల్లు కూడా మోహన్‌లాలు దేననిన్నీ ఒక వారంరోజులలోగా దీన్ని కాళీజేసి వెళ్ళవలసిఉంటుందనిన్నీ ఉంది. మనస్సు సరి పుచ్చుకుని కొద్దిగా విశ్రాంతి తీసుకుందామనుకుంటున్న సమ యంలో మళ్ళీ ఆ దంపతులకు ఇంకో గడ్డుసమస్య వచ్చి పడింది. ఆరోజు వారికి ఎలాగడిచిందో భగవంతునికి తప్ప ఇతరులకు చెప్పనలవిగాదు.

మరునాడు చంప అనునయవ్యాఖ్యాల భర్తతో 'ఒక సారి మీరు భవానీపూర్ వెళ్ళి మోహన్‌ను కలునుకొని రా రాదూ?' అంది.

'ఎందుకూ?'

'ఆయన మీ బాల్యమిత్రులు. మన ఆస్తినంతనూ పాతిక వేలరూపాయలక్రింద దఖల్ చేసుకోడని నా నమ్మకం. మిమ్మల్ని భయపెట్టటానికే ఇట్లా చేసిఉంటారని నా ఉద్దేశం. మీరుపోయి బ్రతిమిలాడిన గడువు పెంచునని నా నమ్మకం.'

'ఛీ, వాడు బాల్యమిత్రుడా! కోమటి, షైలాక్! అతనికి డబ్బుకుమించి మరేమీ కనుపించదు. అతడా నా బాల్యమిత్రుడు! అయిదేళ్ళక్రితం అప్పుకోసం వెళ్ళినప్పుడే అతని స్వభావం గ్రహించాను. నేను డబ్బుకావాలని అడగ

గానే మొదట తటపటాయించాడు. చివరకు ఆస్తి తనఖా వ్రాస్తాననగానే ఆలోచించి ఇస్తానన్నాడు. ఎంత శ్రైరి దానవు. దరిద్రావస్థలోనున్న నాకు, ధనాధికుడైన అతనికి స్నేహం పొసగుతుందా!'

చంప కొంచెం ఆలోచించి మృదువుగా భర్తతో "ఆలోచించండి! 'చిన్ననాటి మిత్రత్వమే - మిత్రత్వ' మంటారు పెద్దలు. మీరు మీ మిత్రుని అనవసరంగా శంకించుచున్నారని నా అభిప్రాయం" అన్నది.

'మైత్రి; ఔను; ఒకప్పుడు మిత్రులమే, కాని ఆ మైత్రి యిప్పుడు ధనపు రాసుల క్రిందపడి నలిగిపోయింది!'

చంప ఏమీ మాట్లాడలేదు. ఆమె కళ్లలో నీరు తిరిగింది. అదిచూసి మదన్‌కు కూడా మనస్సు చివుక్కుమంది. కొంతసేపు నిశ్శబ్దంగాఉండి

'సరే నీకోరిక మట్టుకు ఎందుకు కాదనాలి, ఒకసారి అతనివద్దకు వెళ్ళివస్తాను. దానివల్ల లాభమేమీ ఉండదు. ఒక వేళ ఒకటి రెండేళ్లు గడువిచ్చినా ఎక్కడనుండి అంత మొత్తం తెచ్చి తీర్చగలను. బాకీ క్రింద ఆ రెండిళ్లు తీసుకుని ఈ ఇల్లు వదలి పెట్టవలసిందిగా అడిగిచూస్తాను. ఈ యిల్లయినా మిగులుతుంది.' అని బయలుదేరటానికి సిద్ధమయాడు.

'ఉండండి, నిన్నరాత్రినుంచీ మీరేమీ తినలేదు. కొంచెం ఫలహారం చేసివెళ్లండి' అంటూ లోపలకువెళ్లి ఒక పళ్లెంలో 'పేడాలు' ఒక గ్లాసునిండా పాలుతెచ్చి ముందు పెట్టింది. తరువాత, పెట్టె తెరచి ట్రాంచార్జీ నిమిత్తం డబ్బులు తేబోయింది.

"నీ వద్ద యింకెంత చిల్లర ఉంది"

"మూడు రూపాయిల పావలా ఉంది."

'ఉండనియ్, చల్లగానేఉంది. నడిచిపోతాను. ట్రాము తోపనిలేదు.' అని బయలు దేరాడు.

చంప ఒక చిన్న నిట్టూర్పు విడిచి పెట్టెలో డబ్బులు దాచి మూతవేసింది.

మదన్ కాలినడకను భవానీపూర్‌లో మోహన్‌లాల్ భవంతికి చేరుకునేప్పటికి తొమ్మిది గంటలయింది. దర్వాన్‌ను విచారించి మోహన్ ఇంట్లోనే ఉన్నట్లు తెలుసుకున్నాడు. వాడిద్వారా తనరాక లోపలకు తెలియజేశాడు. కొంత సేపటికి నౌకరు బయటకువచ్చి మదన్‌ను లోపలికి తీసుకు పోయాడు. క్రింది అంతస్థు వసారా ప్రక్క గదిలో ఆసమయంలో మోహన్ పత్రిక చదువుకుంటూ ఉంటాడు. టేబిల్ మీద త్రాగగా మిగిలిపోయిన టీకప్పుమీద ఈగలు వాలుతూ ఉన్నాయి. మదన్‌రాకను గుర్తించనట్లుగానే మోహన్ యింకా వార్తా పత్రిక చదువుతూన్నట్లు నటించాడు. పలుకరించనుకూడా పలుకరించలేదు. కొంచెంసేపటివరకు చూసి మదన్ తానే ముందుగా 'మోహన్' అని పలుకరించాడు.

అప్పుడు మోహన్ తన దృష్టిని అతని వైపుకు మరల్చాడు. అతడి వంటిన పరిశుభ్రమగు వస్త్రములేదు గడ్డం మాసివుంది. తల సంస్కారంలేనందున చీదరగా ఉంది. మాసి వెలిసిపోయిన కోటుమీద పూర్వమెప్పటిదో తండ్రి తాతల నాటి శాలువ కప్పుకుని ఉన్నాడు. ముఖంలో మునుపటి ప్రసన్నతలేదు. కన్నులు లోతుకుపోయి ఉన్నాయి. వెనుకటి

శరీర లావణ్యమే తప్పిపోయింది. యిదంతా చూచి లోలోపలే విచారపడ్డాడు, బయట కేమీ కనపర్చకుండా ?

'ఎవరూ ? మదన్, నువ్వా కూర్చో!' అన్నాడు. ఒక కుర్చీ అతనికి దగ్గరగా లాక్కొని కూర్చున్నాడు. మోహన్ మళ్ళా పేపరు చదువుకుంటూ కూర్చున్నాడు. ఎంత సేపటికీ తనతో మాట్లాడేట్టు కనుపించలేదు. చాలాసేపు ఎదురుచూశాడు. ఇంతలో పేపరు బల్లమీద పడేస్తూ 'ఏం ! ఇలావచ్చావు! మదన్ ?' అన్నాడు.

"నీకు తెలియనిది యేమున్నది !"

మోహన్ చిన్నగానవ్వుకున్నాడు. అది విషపునవ్వుగా భావించి భ్రాంతిపడ్డాడు మదన్. మదన్ ప్రశ్నకు జవాబివ్వకుండానే 'అంతా క్షేమమేనా ?' అన్నాడు.

'ఆ. అంతాకుశలమే. అందుకోరకే ఇవాళ తమ దర్శనానికి రావలసివచ్చింది !'

"ఎందుకని ?"

"ఎందుకో నీకు తెలియదా ?"

"చెప్పందే ఎట్లా తెలుస్తుంది ?"

'మూడు ఇళ్లనూ వదులుకోవలసిందేనా ?'

మోహన్ కనుబొమలుచిట్లించి 'ఏ ఇళ్లు! ఏమైనవి?' అని ఏమీ తెలియనివాడివలె అడిగాడు.

మదన్‌కు ఓర్పు నశ్నగిలింది. కోపంతో బిగ్గరగా 'ఎందుకీమాటలు ! ఏయిళ్లో నీకు తెలియదా ? ఏమైనవో కూడ నీ వెరుగవు ? నీకు ఎంత ధనముంటేనేమి. నా యిళ్లు

మూడింటినీ తీసుకొని అనుభవించాలని చేసినపని ఆలోచించి చేసిందికాదు. నీవింత స్వార్థపరుడవని నేననుకోలేదు.' ఈ మాటలంటూంటే మదన్ ముఖంలో క్రోధం వ్యక్తమవుతోంది.

ఈతని ముఖంచూచేటప్పటికి మోహన్‌కు చాల కష్టం కలిగింది. ఏదో చెప్పాలని అనుకున్నాడు గాని చెప్పలేక పోయాడు. తన దృష్టిని మదన్ వైపునుంచి మరల్చుకుని కిటికీగుండా తోటలోకి పోనిచ్చాడు. కొంచెం సేపయాక నౌకరువచ్చి 'టీ తెమ్మంటారా' అంటూ టేబిల్‌మీద ఉన్నకప్పు తీసి తుడుస్తూ అడిగాడు. అవసరం లేదనటంవల్ల వాడక్కడనుంచి వెళ్ళిపోయాడు. బల్లమీదఉన్న తమలపాకుల పెట్టెను తెరుస్తూ 'పాన్ వేసుకుంటావా మదన్' అని మోహన్ అడుగుతూ పాన్‌దానును అతని ముందుకు తోశాడు. తాంబూలం చర్వణముచేయుచూ మదన్ వైపుచూచి, 'నీయిళ్ళ సంగతేనా అడిగేది ?'

'అవును. పాతిక వేలకూ మూడిళ్ళూ నీకు వదిలివేయవలసిందేనా ?'

'అదేగా దస్తావేజులో నువ్వు వ్రాసియిచ్చిన షరతు!'

'ఆ సంగతి తెలుసును.'

'అసలూ-వడ్డీ కలసి ఎంతయిందో తెలుసా ?'

'తెలుసు.'

'ఎంతయి ఉంటుం దనుకుంటున్నావు ?'

'షుమారు నలభై అయిదు వేలదాకా అయి ఉంటుం దనుకుంటున్నాను ?'

'అయితే నీవు ఆ మూడుఇళ్ల ఖరీదు ఎంతఉంటుం దంటావు ?'

'ఈ అయిదు సంవత్సరాలలోను కలకత్తాలో యిళ్ల ఖరీదు రెండింతలవరకూ పెరిగిందన్న సంగతి నీకూ తెలుసు. యిప్పుడు వీటి మూడింటి ఖరీదు యాభై వేలకు తక్కువ ఉండదు !'

'బహుశా అంతకంటె ఎక్కువ అయినా అవచ్చు. దస్తావేజులో వ్రాసుకున్న గడువు అయిదేళ్లు గడిచిపోయిన తరువాత లక్షరూపాయిలు యిచ్చినా ఆ యిళ్లు నీకురావు. మనం పెట్టుకున్న అయిదేళ్లు గడువు పూర్తి అయింది. ఇంత వరకు నువ్వు ఒక్కపైసా అయినా అప్పుక్రింద చెల్లించలేదు.

'అవును !'

'పోనీ ఆ నలభై అయిదువేల రూపాయిలు యిచ్చి నీ మూడిళ్లూ నువ్వుతీసుకో. యిప్పటికైనా మించిపోయిం దేమీలేదు.'

మోహన్‌కు సమాధానమేమీ ఇవ్వలేక మదన్ తలవంచుకొని కూర్చుండి పోయాడు.

మనస్సులో 'అయ్యో ఆ ఇళ్లు చేస్తాయన్న ఖరీదు యాభై వేలలోనూ నీ నలభై అయిదువేల రూపాయిలు పోను మిగతా అయిదువేలూ ఇవ్వమంటే ఏమనేవాడో ? అడక్కపోతినే' అని విచారించ సాగాడు.

'నువ్వు నలభై అయిదువేలూ తీసుకొని యిళ్ళు యిస్తా నన్నప్పటికీ నేను తీసుకునే పరిస్థితిలో లేను. ఈరోజుకు యింట్లో మూడురోజులకు సరిపడే పదార్థములే యున్నవి.

ఆ పయిన నిరాహారదీక్ష అవలంబించవలసిందే ' అని వినీ వినబడనట్లు మెల్లిగా చెప్పాడు.

' అయితే ఇప్పుడు నన్నేమి చేయమంటావు ? '

మదన్ బతిమాలుతూ, 'మన చిన్ననాటి స్నేహాన్ని మరచిపోకు. నేను నాశనమైపోకుండా చూడు. వడ్డీలోంచి కొంత రాయితీచెయ్యి, నా మూడు యిండ్లు ఖరీదు యాభై వేలదాకా ఉంటుందని నీవు వప్పుకున్నదే. నువ్వా వ్యాపార స్తుడవే ! నాకంటే నీకే యీ విషయాల్లో అనుభవమెక్కువ. అద్దెకిస్తూన్న రెండుయిళ్ళు నీ బాకీక్రింద తీసుకుని నన్ను వదిలి పెట్టు. ఆ రెండిళ్లూ ముప్పైఅయిదు వేల రూపాయిలకు పైగా ఖరీదు వస్తుంది. నేను పుచ్చుకున్న యిరవైఅయిదు వేలకు అదనంగా పదివేలు రాగలవు. బాల్యస్నేహితుణ్ణనే అభిమానంతో తక్కువ వడ్డీ పుచ్చుకున్నాననుకో ! నేను ఉంటున్న యిల్లు విడిచిపెట్టు. లేకపోతే ఏ చెట్టు క్రిందో తలదాచుకో వలసివస్తుంది. ఉండేందుకు యిల్లు ఉంటే ఏదోవిధంగా పొట్ట నింపుకుంటాము. నావద్ద యిప్పుడు మిగిలింది మూడురూపాయిల పైన కొంత చిల్లర మాత్రమే. అయినప్పటికీ ఇంక నువ్వు నాకు డబ్బేమీ యివ్వ నక్కరలేదు. నాదగ్గరఉన్న పయికంతో మూడురోజులు గడుస్తుంది. ఈలోగా ఏదోనౌకరీ చూచుకుంటాను. వడ్డీ రాయితీ చెయ్యి. నే నుంటున్న ఇల్లు విడిచిపెట్టు ! '

మోహన్ వినీ విననట్లు అంతా విన్నాడు. తమలపాకులు నములుతూ యాదాలాపంగా ఒకసారి కిటికీలోగుండా తోటవైపుచూచాడు. మదన్ తలవంచుకుని చెప్పుకుపోతోంటే

అతను చూడకుండా అతనివైపు చూస్తూ అంతశ్రద్ధ లేనట్లుగా ప్రవర్తించాడు.

'నీ పిల్లలసంగతి చెప్పావు, అది బాగానేఉంది. మరి నాకుకూడా పిల్లలున్నారు. మనము పడే ఈ తాపత్రయ మంతా మన పిల్లలకొరకేకదా ! మనము లేకపోయినప్పటికీ, మన బిడ్డలకు ఏలోటూ రాకుండా ఉండేటట్లు చూడవలసిన బాధ్యత మనపైవున్నది. నా తండ్రితాతలు సంపాయించి నాకిచ్చిన ఆస్థిని కాపాడి, వృద్ధిచేసి నా బిడ్డలకు వప్పగించవలసిన బాధ్యత నాపైయున్నది. స్నేహితుడవని, బాల్యమిత్రుడవనే భావంతో నాపిల్లలసొత్తును నీకొరకై ఖర్చుపెట్టుట అధర్మము కాదా ?' అని అన్నాడు మోహన్.

తన ఈ బాల్యమిత్రుడు తమ కర్తవ్యపాలనమును గురించి ఇచ్చిన ఈ సుదీర్ఘమైన ధర్మోపన్యాసం వినేప్పటికి, అతనిపై కోపం కలగటానికి బదులు నవ్వువచ్చింది. దాన్ని బయటకు రానీయకుండా పెదవులతో అదిమిపట్టాడు. కాని అతనిపై మిక్కుటంగా అసూయపడ్డాడు. 'ప్రపంచంలోని ఇతర ధనవంతులవంటివాడే నామిత్రుడుకూడాను' అని మనస్సులో నిశ్చయించుకున్నాడు. ఈ మిత్రుడే ఒకప్పుడు తన పాదాని కేదైన దెబ్బతగిలితే, తనకంటె అతడే ఎక్కువ బాధపడే వాడు. నేడు తనకింత దురవస్థ ప్రాప్తించినప్పటికీ అతడేమీ విచారపడటంలేదు. మీదుమిక్కిలి నిశ్చలంగానున్నాడు. కుసుమకోమలమైన అతని హృదయం నేడు ధనపిశాచా భూయిష్టమయింది. దేవునివంటివాడు నేడు పిశాచస్వరూపుడై పోయాడు.

మదన్ ఊరికే ఉండిపోవటంచూసి, మోహన్ మళ్ళీ చెప్పాడు. 'నువ్వుంటూన్న ఆ ఇంటికి అప్పుడే బేరంవచ్చింది. నిన్న నెవ్వరో నెలకు యాభైరూపాయలు ఇస్తామని అద్దెన్నా ఇవ్వవచ్చినట్లు మా 'వకీలు'గారు కబురుచేశారు.'

'అవును! ఒక వారంరోజులలోపల ఇల్లు కాళీచేయ వలసినదిగా నిన్ననే వారు నాకుకూడా నోటీసుపంపారు!'

'అవును మదన్, నీవు ఒక చిన్న ఇంటిని అద్దెకు పుచ్చుకుంటే బాగుంటుందని నా అభిప్రాయం. పైన పడుకోటానికి ఒకగది, క్రింద ఒక వంటగది, సామానుల కొకగది, స్నానాలగది, నీటికుళాయి, మరుగుదొడ్డి ఉంటేచాలు. ఇలాటి యింటికి పట్టణంలోఅయితే చాలా అద్దె యివ్వాల్సి ఉంటుంది. భవానీపూర్ ప్రాంతాల్లో ఇంతఇల్లు పది పదిహేను రూపాయిల అద్దెలో దొరుకుతుంది. నీకు సమ్మతమైతే నేను మా నౌకరుతో చెప్పి వెతికిస్తాను. ఇప్పటిపరిస్థితిలో నీకంత పెద్దఇల్లు అనవసరం. మీరిద్దరూ, ఇద్దరు పిల్లలూను. నేను చెప్పినమాదిరిఇల్లు సరిపోతుంది. ఏమంటావ్?'

మదన్ ఏమీ జవాబివ్వలేదు. తలవంచుకుని ఏదో ఆలోచిస్తూ కూర్చున్నాడు. కొంతసేపటివరకు మోహన్ అతని జవాబుకై ఎదురుచూచి—'అలాటిఇల్లు వెతకమని నౌకరుతో చెప్పమన్నావా?'

'ఎందుకులే నీ కింతశ్రమ. నేనే వెతుక్కుంటాను. ఇప్పటికి చాల శ్రమయిచ్చాను. చాలా దయతలచావు. ఇంకెందుకులే. తిండితిప్పలులేక మేము చచ్చిపోతాము. అప్పుడు మా పిల్లలుమట్టుకు బ్రతుకుతారన్న నమ్మకం ఏముంది. పుణ్యా

త్న్మడవు ఇంకోమాసంవరకూ గడువివ్వు. నీ ధర్మమాఅని, ఏఇంట్లో పుట్టిపెరిగామో ఆ ఇంట్లోనే చచ్చిపోతాము. తరువాత నిరభ్యంతరంగా ఇల్లు నువ్వాక్రమించుకోవచ్చు.' అని కొంచెం హెచ్చుస్థాయిలో అన్నాడు.

ఈ మాటలు గది అంతా ప్రతిధ్వనించాయి. మోహన్ ఏమీ మాటడలేక తోటవైపు చూస్తూవుండిపోయాడు. మదన్ తన ఈ ప్రయత్నంవల్ల లాభంలేదని నిశ్చయించుకున్నాడు. లేచి నుంచిని, 'సరే వెళ్లివస్తాను. అనవసరంగా నీకాలాన్ని వృథాగా చెడగొట్టాను.' అని వెనుకటి స్వరంతగ్గించి అతి నమ్రభావంతో చెప్పి బయలుదేరాడు.

'వెళ్లవచ్చును. కూర్చో'

మదన్ మళ్లీ కుర్చీలో కూర్చున్నాడు. అతనిముఖం చిన్నబోయింది. శూన్యదృష్టితో మోహన్‌వైపు చూస్తూఉండిపోయాడు.

'కొద్దిగా టీ తెప్పించనా?'

'వద్దు'

'తమలపాకులు వేసుకుంటావా?'

'అవసరం లేదు.'

తమలపాకుల పెట్టెను అవతలకుతోసి మదన్‌వైపుగా వంగి మోహన్ మొదట మెల్లిగాను, తరువాత ఉద్వేగంగాను చెప్ప మొదలు పెట్టాడు.

'చూడు మదన్! మన స్నేహాన్ని పురస్కరించుకుని నా బిడ్డలకు అన్యాయం చేయజాలనని ఇదివరకే చెప్పాను.

ఆ అభిప్రాయాన్ని ఇప్పటికీ మార్చుకోలేను. అంతమాత్రం చేత నేను నీ పరిస్థితిని తెలుసుకోలేనంత అజ్ఞానిని, మూర్ఖుణ్ణి గాను. తండ్రి తాతలనాటి ఆ ఇంటిలోనే భార్యా బిడ్డలతో సహా ప్రాణాలను విడుస్తాననటం తెలివితక్కువతనం, చేతగాని తనం. ఈ వ్యర్థప్రసంగమును వదిలిపెట్టి ఏదైన ఉద్యోగము నకై ప్రయత్నించి, సంపాదించి భార్యా బిడ్డలను పోషించు కొనుము. 'ఉద్యోగినం పురుషసింహముపైతి లక్ష్మీః!' 'ప్రయత్నశీలుడగు పురుషసింహుని లక్ష్మీవరించును.' అని మనము చిన్ననాడు చదువుకున్న సంగతి మరచిపోకు, 'తిండిలేక నేను, నాభార్యా-బిడ్డలు మరణింతుము.' అని పదే పదే అనుకొనుట తెలివితక్కువ తనము. నీవు పురుషుడవు. పురుషులు మాట్లాడవలసిన మాటలు కావివి. దుఃఖపడుట స్త్రీలకే తగును. ధైర్యము తెచ్చుకొనుము. ఈ కలకత్తా పట్టణమున లక్షలాది జనము నీవంటి వారున్నారు. వారెవరూ తిండిలేక మరణించుటలేదు. ఏదైనఉద్యోగం సంపాదించుము. నీ భార్యా - బిడ్డలు ఎన్నటికి నిరాహారులై మరణించరు." అంతవరకు చెప్పి మోహన్ ఒకక్షణము ఊరుకున్నాడు.

మరల మందస్వరంతో 'ఈ పరిస్థితుల్లో క్రొత్త ఇంటిలో ప్రవేశించటం ప్రతినెలా ఆయింటికి అద్దెఇచ్చుకోటం నీకు యిబ్బందిగానే ఉంటుంది. అయితే నీకొకమార్గం చూపిస్తాను. ఒకసంవత్సరమువరకు నీవా ఇంటిలో ఉండుటకు అనుమతిస్తాను. ఈలోగా ఏదైనా ఉద్యోగములో ప్రవేశించితే అప్పటికి నీపరిస్థితి చక్కబడగలదు. అప్పుడు నీవింక ఎవరి సహాయ సంపత్తిమీద ఆధార పడవలసిన అవసరముండదని నా విశ్వాసము. నేటినుండి ఒకసంవత్సరంవరకు ఆఇంటియందే

యుండవచ్చును. తదుపరి ఖాళీచేయవలసి ఉంటుంది'

ఈమాట పూర్తికాగానే మదన్ మరలలేచి నుంచుని, వ్యంగ్య స్వరముతో 'బాల్యమిత్రమా, వందనములు నీవు చూపిన ఈ అసాధారణమైన కృపకు అయాచితంగా యిచ్చిన ఈ నీ ఉపదేశానికి నా వందనములు' అని చేతులు జోడించి, తొందరగా అడుగులు వేసుకుంటూ అక్కడనుంచి వెళ్ళిపోయాడు.

---

## 4

మోహన్‌లాల్‌ను ఒంటిగా గదిలో విడిచి బయట వరండాలోకి మదన్ వచ్చేప్పటికి అక్కడ గోడకున్న గడియారం పదిగంటలు కొట్టింది. అచ్చటనుండి అతడు హారీష్ ముఖర్జీ వీధిని ఉత్తరంవైపు తిన్నగా త్వరితగతిని పోసాగాడు. ఒడలంతయూ అలసి ఉండటంవల్ల బాగా చమటపోసింది. ఆ ప్రక్కనే ఓ మర్రిచెట్టునీడను కొంతసేపు అలుపుతీర్చుకుందామని నిలబడిపోయాడు. ముందు కూడలి దగ్గరగా పెద్ద భవనములు కనిపిస్తున్నాయి. ఆదారినే కచ్చేరీలకుపోవు ఉద్యోగస్తులతో నిండిఉన్న 'ట్రాము'లు పరుగెత్తుతున్నాయి. ప్రతి వ్యక్తీ ఎదో ఒకపని తొందరలో ఇతర విషయములేవి తనకు పట్టనట్లు త్వరితగతిని పోవుచున్నట్లు అతను గమనించాడు.

మదన్ ఆ చెట్టు నీడను నిలబడి ఈ దృశ్యాలన్నీ శ్రద్ధగా చూస్తున్నాడు. అతని మనస్సు విచారభారంతో చికాకుపొంది ఉంది.

'ప్రతిఒక్కడూ ఏదో వ్యాపకంతో తమగమ్యస్థానాలకు చేరుకుంటున్నారు. ఏపనీలేనివాడిని నేనొక్కడనే ఉన్నట్లుంది. 'నీవు చేసిన ఉపదేశం అయాచితం' అని మోహన్‌ను ఎగతాళి చేసాను, ఆ ఉపదేశం నా చెవిలో యింకా మారు మ్రోగుతూనే యున్నది. 'ఉద్యోగినం, పురుష సింహముపైతి లక్ష్మీః' అన్నమాట నిజమే, అన్నములేక మేమెందుకు చత్తుము. నే నేదైన ఉద్యోగము చూచుకుందును. ఏదైననేమి? గౌరవా గౌరవములను గురించి విచారించుటవల్ల లాభములేదు. ఒకపూటకు తిండియున్ననూ చాలు. ఆ మాత్రము సంపాదించలేనా? తప్పక నాకు ఉద్యోగం దొరకును. మేమందరము సుఖపడుదుము. దేవుని కృపానుగ్రహాలు నాపై కలుగుగక పోతాయా!' అని తనలోతాను తలపోయసాగాడు.

సమీపమందే ఒక రెండంతస్తుల మేడఉంది. దానిలో ఒక ఇంగ్లీషుకంపెనీ బోర్డు పెద్ద అక్షరములతో వ్రాసిఉంది. తిన్నగా అచ్చటికిపోయి దర్వాన్‌ను బ్రతిమిలాడి పై అంతస్థులోఉన్న మేనేజరుగదికి వెళ్ళాడు. మేనేజరు ఎక్కౌంటు బుక్ ముందువేసుకుని ఏదో లెక్క చూచుకుంటున్నాడు. అతని వయస్సు యాభైపైన వుంటుంది. బట్టతల-గడ్డము మీసము నెరసినవి. గదిలో ప్రవేశించగనే మేనేజరుకు 'గుడ్‌మార్నింగ్ సార్' అని నమస్కరించాడు. మేనేజరు రిజష్టరుమీాదనుంచి తనదృష్టిని మదన్‌వైపు త్రిప్పి- 'గుడ్

మార్నింగ్' అని అతని వందనాన్ని స్వీకరించి, 'ఏమిపనిమీద దయచేశారు' అని ఇంగ్లీషులో అడిగాడు.

'ఉద్యోగ మేదైనా దొరుకుతుందేమోనని వచ్చాను. ఏదైన ఉద్యోగమిచ్చి నన్ననుగ్రహిస్తే నేను, నా పిల్లలూ జీవిస్తాము. లేనిచో ఏదొంగతనమో, కాకపోతే ఆత్మహత్యో చేసుకోవలసివస్తుంది.'

మేనేజరు అతనిమాటలు విన్నాక అతనిచూపు, బట్టలు చూచి పిచ్చివాడనుకున్నాడు. దగ్గరగాఉన్న యినపపెట్టెపై అతనిచూపు పోయింది. దానితలుపు మూసేఉంది. జేబులో తాళముచెవులు ఉండటం చూచుకుని తృప్తిచెందాడు. అతని తలంపు ఈతడు పిచ్చివాడని. ఏమన్నా చేస్తాడనిభయపడ్డాడు. వెంటనే టేబిల్ మీదఉన్న కాల్ బెల్ ప్రయోగించాడు. బయట కూర్చునిఉన్న నౌకరు భయభక్తులతో ఎదుటికివచ్చి నిలబడ్డాడు. వీడు రాగానే మేనేజరు, మదన్‌తో— 'బాబూ! ఇప్పుడు మా కంపెనీలో ఖాళీలేమీ లేవు. ఆమాట చెప్పటకు నేను చాలా విచారపడుతున్నాను. అయినప్పటికి మీ సర్టిఫికేట్ల కాపీలతో కంపెనీకి ఒక దరఖాస్తు పంపండి. ఖాళీ రాగానే మీకు తెలియపరుస్తాను. గుడ్ మార్నింగ్'అని నౌకర్ని చూచి, 'బాబుగారికి దారిచూపించు' అని తనపనిలో మళ్లా నిమగ్నుడయ్యాడు.

మదన్ ఒక నిట్టూర్పుతో అక్కడినుంచి బయలు దేరాడు. ఆతర్వాత అతనెన్నో ఆంగ్లకంపెనీలకు పోయి మేనేజర్లను కలుసుకున్నాడు. కాని ఎక్కడా అతని ప్రయత్నము ఫలించలేదు. ఒకొక్కచోట మేనేజర్‌ను చూచుటకే

అనుమతి దొరకలేదు. కొన్ని చోట్ల అనుమతి దొరకినా వారితో మాట్లాడుటకే సమయంచిక్కలేదు. చివరకు విసిగి మదన్ 'ధర్మతోలా' వైపుగా నడవసాగాడు. కొంతదూరము పోయాక ఒక ప్రసిద్ధ ఆంగ్ల దైనిక పత్రిక ఆఫీసుముందు స్వదేశీయులు కొందరు, మరికొందరు యూరేషియన్‌లు నిల బడి దేన్నో చూస్తూండటం చూచాడు. ఆ వైపుకే తాను పోయి చూడగా ఆరోజు దైనికపత్రిక బులిటెన్‌లో ఎక్కించి ఉంది. అందరూ తమకు కావలసిన విషయాలను అందులో చూచు కుంటున్నారు. ఎక్కువమంది 'వాంటెంగ్ కాలం'లో చూచి తమకు కావలసిన విషయాన్ని వ్రాసుకుంటున్నారు. కొందరు నోటుబుక్కులోను, కొందరు కాగితపుముక్కలమీద వ్రాసుకుంటున్నారు. వాళ్లను చూసి తానూ అడ్రసులు వ్రాసుకుందామనుకున్నాడు కాని తనవద్ద కాగితంగాని పెని సిలుగాని లేదు. దారిప్రక్కన పడిఉన్న ఒకనోటీసు ముక్కను తీసుకున్నాడు. ప్రక్కనే మాసిపోయిన టోపీ-చినిగిపోయిన కోటు ధరించిన ఒక యూరేషియన్ ఏదో వ్రాసుకోవటం చూచి అతను వ్రాసుకోనేటంతవరకు ఉండి పూర్తికాగానే అతని వద్దకు వెళ్లి మెల్లిగా 'ఒకసారి పెనిసిల్ యిప్పిస్తారా' అని నమ్రతగా అడిగాడు.

ఆ ఆంగ్లదొర కళ్లెర్రజేసి 'గెటౌట్ యూ! డామ్ నిగ్గర్!' అన్నాడు.

మదన్ ఈ అవమానకరమైన మాట వినగానే సహిం చలేక ఉగ్రుడై అతని చంపమీద లాగి గూబగుయ్యి మనే టట్లు ఒకటి పుచ్చుకున్నాడు. మొదట దిమ్మెక్కటంవల్ల కొంతసేపటి వరకు ఆ ఆంగ్లేయ యువకుడు ఏమనకపోయినా

తరువాత చౌకా చేతులు పైకెత్తి మదన్‌పైకి కలియ బడ్డాడు. దోవను పోయేవారు పదిమంది చుట్టూ చేరారు. ఈ సమూహాన్ని చూచి దగ్గరలో ఉన్న యూరేషియన్ సార్జంటుకూడా అక్కడకు చేరాడు. అక్కడ బీటు కానిస్టే బుల్ కూడ ఇంతలో లోపలకు దారిజేసుకువచ్చి అతికష్టం మీద యిద్దరినీ విడతీశాడు. ఆ ఆంగ్ల యువకుని ముక్కునుండి నెత్తురు కారుచున్నది. అతడు సార్జంటుతో 'ఈ నేటివ్–నన్ను కొట్టాడు.' అని పితూరీ చేసాడు.

మదన్ అతని పితూరీ విని కోపముతో 'నేనా కొట్టింది? మొదట నేను పెనిసిల్ అడిగాను. వీడు, గెటవుట్ యూ డామ్ నిగ్గర్ అన్నాడు. నేనా నిగ్గర్ (నల్లవాడు) నేం! వీడో? నాకంటె నలుపుకాడూ?' అన్నాడు.

సార్జంటు, కానిస్టేబుల్ సహాయంగా ఆ యిద్దరినీ పోలీస్ స్టేషన్‌కు తీసుకువెళ్లాడు. అక్కడి ఇన్‌స్పెక్టర్ ఆంగ్లేయుడు. సార్జెంటు ఇచ్చిన స్టేటుమెంటు ఆధారంగా, మదన్‌పై మార్గమునందు శాంతి భంగముగా ప్రవర్తించినట్లు నేరము బనాయించాడు. ఆపైని మదన్ ఊరుపేరు విలాసము మొదలైనవి వ్రాసుకుని, 'ఈ రోజు శనివారము ఎల్లుండీ సోమవారం 'లాల్‌బజార్' లోని పోలీసు కోర్టులో నీపైన తేబడిన కేసు విచారించబడుతుంది. నీకిప్పుడు ఎవరైనా జామీనుగా ఉంటే విడుదల చేస్తాను' అన్నాడు ఇన్‌స్పెక్టర్.

'నాకు జామీనుగా ఉండేవారు ఎవరూ లేరు' అన్నాడు మదన్ వెంటనే.

శనివారం పగలు రాత్రి ఆదివారం పూర్తిగా మదన్ చెరసాలలో ఉంచబడ్డాడు. అతడచ్చట ఈ రెండు రోజులూ ఎట్లా గడిపాడో ఆ పరమేశ్వరునికే తెలియాలి. 'ఆకస్మికంగా నాజాడా తెలియక పోవటంవల్ల చంపావతి ఎంతగా దుఃఖించు చున్నదో? ఈ సంసార బాధలు పడలేక నేనే సన్యాస్సుల్లోనో కలిసి పోయానను కుంటోందేమో! లేక ఆత్మహత్య చేసు కున్నానేమోనని విలపించంటం లేదుగదా? పాపమా దుర దృష్ట వంతురాలికి నా జాడ తెలుపు వారెవ్వరూ లేరుకదా? యింట్లో యింకా మూడురూపాయిలున్నవి గనుక ఈ రెండు మూడు రోజులు ఇబ్బంది పడనక్కరలేదు. రేపు కోర్టులో నాకు శిక్ష విధించినచో వారిగతి ఏం కాను? చివరకు ఆకలికి ఓర్వలేక వీధుల వెంట ముష్టెత్తుకోవలసి వస్తుందా?'

ఇలా ఆలోచిస్తూ ఎమియూ తోచక ఆ చరసాలలో కూర్చుని మిక్కిలి విచార పడసాగాడు. పహరా యిచ్చు వాడే వేళకు అన్నము తెచ్చి పెట్టుచున్నాడు గాని అత డేమియూ ముట్టుకొనుట లేదు. ఆకలివల్ల అతనికి నిద్దరకూడా పట్టటం లేదు.

మదన్‌ను సోమవారమునాడు ఉదయం పదిగంటలకు కేసు విచారణ నిమిత్తం కోర్టులో హాజరు పెట్టారు. మేజి స్ట్రేటు ప్రశ్నించగా మదన్ జరిగిన సంగతులన్నీ దాచక చెప్పివేశాడు. కాని ఆ యూరేషియన్ యువకుడు వెంటనే అందుకుని

'నేను బులిటెన్‌లోని పేపరు చదువుచున్నాను. అందులో ప్రకటన చదువుటకు వీలులేకుండా యితగాడు

అడ్డము వచ్చాడు. ప్రక్కకు తొలగమని నేను ఎంతో విన యముతో అడిగినా లేవకుండా కోపము తెచ్చుకుని నామీద కలియబడ్డాడు. అతని దెబ్బవల్ల నాముక్కు చితికి రక్తము కారుచున్నది. పోలీసు సార్జంటుగారుకూడా చూశారు!'

మేజస్ట్రేటు అంతావిని మదన్‌తో

'మీకు ప్లీడరు ఎవరైనా ఉన్నారా?'

'లేరు'

'క్రాస్ పరీక్ష ఏమైనా చేస్తారా?'

'ఏమని చేయను!'

మేజస్ట్రేటు మదన్ చెప్పకున్న విషయములను గురించి యూరేషియన్‌ను ప్రశ్నించగా అవన్నియూ అబద్ధములేనని చెప్పాడు. పోలీసులు-సార్జంటు, తాము చూచింది చెప్పారు.

మేజస్ట్రేటు మదన్‌తో 'నీకు సాక్షులున్నారా?' అని అడిగాడు.

'ఈ సంగతి జరిగినప్పుడు అక్కడున్నవారు-ఆదారిన పోయేవారు అందరూ చూచారు.'

'వారిలో ఎవరిపేరైనా చెప్పగలవా?

'నే నెవర్నీ ఎరుగను, ఎలాచెప్పగలను!'

'మేజస్ట్రేటు, అతని యీ జవాబువిని, కొంతసేపటి వరకూ ఆలోచించి, నీకు యాభైరూపాయిలు జరిమానా విధి స్తున్నాను. జరిమానా చెల్లించకపోతే వారంరోజులు జైలుకు పోవలసిఉంటుంది' అని జడ్జిమెంటు చెప్పాడు.

కోర్టు ఇన్‌స్పెక్టర్ మదన్‌తో 'జరిమానా చెల్లించె దవా?' అని అడిగాడు.

'ఇవ్వ లేను'

ఈతని జవాబువిని, ఇన్‌స్పెక్టరు ఆదేశంప్రకారం కోర్టుపోలీసులు మదన్‌ను జైలుకు తీసుకుపోయే ప్రయత్నంలో ఉన్నారు. ఇంతలో అక్కడకు ఒక అపరిచితవ్యక్తి వచ్చి, అయ్యా ఇతడు నా మిత్రుడు, ఈతనితరఫున జరిమానా నేను చెల్లించుచున్నాను' అని కోర్టువారు విధించిన జరిమానా చెల్లించి మదన్‌ను విముక్తుణ్ణిచేశాడు. షుమారు ముప్ఫయి, ముప్ఫైఅయిదు సంవత్సరముల వయస్సుగల ఆ యువకుడు ఆల్బర్టుఫ్యాషన్ క్రాపు, కళ్ళకు బంగారుకళ్ళజోడు, ఖరీదైన దుస్తులు ధరించియున్నాడు. మదన్ ఈవ్యక్తినెన్నడూ చూచి యుండలేదు.

'నాతో రండి' అనేవరకు ఆశ్చర్యములో మైమరచి యున్న మదన్‌కు తెలివిగలిగింది. ఏమీ మాట్లాడకుండా ఆ వ్యక్తిని అనుసరించి నడిచివెళ్ళాడు. కోర్టుమెట్లుదిగి రోడ్డు మీదకు వచ్చేటప్పటికే వీరికోసం ఉంచబడిన ఒక బండి కను పించింది. ఆగంతకుడు మదన్‌ను అక్కడకు తీసుకువెళ్ళి 'ఎక్కండి' అన్నాడు.

మదన్ యేదో స్వప్నంలో ఉన్నట్లుగా అనుకుంటు న్నాడు. వీరెవరో, ఎక్కడనుంచివచ్చారో, ఎక్కడకు తీసుకు పోతున్నారో ఏమీ తెలియటంలేదు. ఇంటికివెళ్ళి భార్యా పిల్లలు ఎట్లాఉన్నారో ముందు చూచుకోవాలి. కాని ఈ పెద్ద మనిషిని కాదని ఎట్లావెళ్ళగలడు. విధిలేక బండిఎక్కి కూర్చు న్నాడు. ఆపెద్దమనిషికూడా బండిపైకెక్కి కూర్చొనగానే అది శరవేగముతో 'సియాల్‌దహ్' వైపుగా ఉడాయించింది.

# 5

బండిలో ఉన్నంతసేపు ఆగంతకుడుగాని, మదన్ గాని యేమీ మాట్లాడలేదు. మదన్ మనస్సు స్థిమితంగా లేదు. భార్యాబిడ్డల విషయమై ఆలోచిస్తూ బాధపడుతున్నాడు. ఏమీతోచక మధ్యమధ్య బండిపోవు త్రోవవైపే చూస్తూ ఉంటున్నాడు. సియాల్ దహ్ దాటి బండి బేలియాఘాట్ లో ప్రవేశించింది. కొంతదూరంపోయాక చుట్టూ చిన్న తోట మధ్యను ఓ రెండతస్తుల మేడఉన్న గేటుముందుకు వచ్చి ఆగింది. అక్కడ ఆగంతకుడు బండిదిగి మదన్ నుకూడా దిగ మన్నాడు. మదన్ ను వెంటబెట్టుకుని ఆ పెద్దమనిషి సోఫాలు మొదలగు ఆసనములతో అలంకరించిన ఓ విశాలమైన గది లోకి తీసుకువెళ్ళి ఇద్దరూ కూర్చున్నారు.

ఆ పెద్దమనిషి మదన్ ను 'స్నానముగాని, భోజనము గాని చేయలేదనుకుంటాను.'

'అవును! తొమ్మిదిగంటలకు అన్నంపట్టుకొచ్చారు, కాని స్నానంచేయలేదని తినలేదు.'

యజమాని నౌకర్ను పిలచి, 'ఈ బాబుగార్ని స్నానం చేయించి, బట్టలుమార్పించి తీసుకురా.'

'వద్దు! ఇంటికివెళ్ళి స్నానంచేసి భోంచేస్తాను. ఇల్లు విడిచి మూడురోజులయింది. నా జాడ తెలియక వాళ్ళు ఆదుర్దాపడుతూఉంటారు.'

'మీ ఇంటివద్ద ఎవరెవరున్నారు?

'నా భార్యా, కొడుకూ, కూతురు, ఇంట్లోపనిచేసే మనిషి.'

'మీ ఇల్లెక్కడుంది?'

'చౌబజార్, బెనర్జీలేన్‌లో.'

'అయితే ఇప్పుడే వెళ్ళాలంటారా?'

'ఇంటివద్ద ఆదుర్దాపడుతూఉంటారు. వంట్లో చికాగ్గా ఉంది. అనుమతిస్తే ఇప్పుడు వెళ్ళి మళ్ళీ సాయంత్రంవచ్చి తమదర్శనం చేసుకుంటాను.'

'ఏమీ తినకుండానే వెళ్ళాలంటారా? కొద్దిగా ఏదైనా పుచ్చుకు వెళ్ళండి.'

'మీ మేలు నేను మరువలేను. నన్ను మీరు జైలుకు వెళ్ళకుండా కాపాడారు! మీరు ఏమనుకోకండి నేను మళ్ళీ వచ్చి తమను దర్శిస్తాను. కాని మిమ్మల్ని ఒకమాట అడగాలనిఉంది.'

'అడగండి.'

'మీరెవరో నే నెరుగను. నానిమిత్తం మీరెందుకు ఇంతశ్రమ తీసుకున్నారో నే తెలుసుకోవచ్చునా?'

'ఒకటిగాదు రెండుమాటలడిగారు' నౌకరు పాన్‌దాన్ తెచ్చి వాళ్ళముందుపెట్టి వెళ్ళాడు. మదన్ ఒక యాలుక్కాయ వలిచి నోట్లో వేసుకున్నాడు.

'నా పేరు ఠాకూర్ జగన్‌మోహన్‌సింగ్. మా ఊరు ఉన్నావ్ జిల్లాలోఉంది.'

'ఉన్నావ్ జిల్లాలోనా? ఎక్కడ?'

'భీష్మాపూర్ లో'

'భీష్మాపూర్ లో ఉండే సుప్రసిద్ధ జమీందార్ ఠాకూర్ జగన్ మోహన్ సింగ్ గారా తమరు ?

'సుప్రసిద్ధ-గిప్రసిద్ధ నాకు తెలియదు ! నేను సామాన్య జగన్ మోహన్ సింగ్ను మాత్రమే.' ఇంతలో లోపలనుంచి ఒక నౌకరు గ్లాసునిండా నీళ్ళు ఒక పళ్ళెములో కొంత మిఠాయి తెచ్చి మదన్ ముందు పెట్టి వెళ్ళాడు. ఠాకూర్ బాబు బలవంతంవల్ల మదన్ లేచి కాళ్ళు చేతులు కడుక్కొని కొద్దిగా ఫలహారముచేసి మళ్ళీ ఆ బాబుతో—

'తమరు నా ప్రశ్నలకు జవాబిచ్చారుకారు ?'

'మీరు శనివారము ఆ ఆంగ్లయువకునితో దెబ్బలాడి తిరిగాడా ? ఆ వార్త నిన్నటి ఆదివారపు పత్రికలో ప్రకటించ బడినది. అది చదవగానే నాకపరిమిత ఆనందంకలిగినది. మనము భారతీయులము. ఆత్మగౌరవమునుగురించి మరిచి పోయితిమి. దారినిపోవునపుడు అనేకవిధములగు అవమానము లను పొందుచున్నప్పటికీ ఏవిధమైన ప్రతీకారమునూ చేయ జాలకున్నాము. మీరు ఆ యూరేషియన్ను 'పెనిసిల్' అడిగి నట్లు, అందుచేత అతడు మిమ్ములను 'డామ్‌నిగ్గర్' అన్నా డనిన్నీ ఆ అవమానమును మీరు సహించక వెంటనే అతని ముక్కుపై—

మదన్ వారిమాటలకు అడ్డువచ్చి— 'ముక్కుమీద కాదు— చంపమీద !'

'చెంపమీదనా ? మరి ముక్కుమీద గ్రుద్దినట్లు వ్రాశారే ?'

'మొదట చంపమీద కొట్టాను. దెబ్బతిని వాడు నామీద కలియబడ్డాడు. అప్పుడూ ముక్కుమీద గుద్దింది.'

జగన్ మోహన్ పకపకా నవ్వుచూ— మీరు ఏ కులస్థులు ?'

'చౌహాన్ ఠాకూరులము ! ఠాకూర్‌ను అయియుండి కూడా ఈలాటి అవమానమును ఎలా సహించమంటారు చెప్పండి ?'

'మంచిపనిచేశారు. వాడు ఇక ఎన్నడూ ఏ హిందు వుణ్ణీ 'డామ్‌నిగ్గర్' అని అన సాహసించడు. ఆ పత్రికలోనే మీపై విచారణ సోమవారంనాడు జరుపబడుతుందని ఉన్నది. అది చదివినమీదట ఆ హైందవవీరుణ్ణి చూడాలనిపించింది. మీరు ఆజానుబాహువులైయుందురనుకున్నాను. బాగా పుష్టి గలిగి ఉంటారనికూడా అనుకున్నాను. కాని నా ఊహ తప్పు. బోనులో మిమ్ములను నిలబెట్టినతరువాత చాలా ఆశ్చర్య పోయాను. 'వీరత్వమునకు బలమే ప్రధానముకాదు- సాహసమే ప్రధాన'మని నేను చిన్నప్పుడు చదువుకున్నాను. నిన్నటి నిదర్శనపూర్వకంగా చూచినట్లయింది నాకు !'

తన్ను పొగడుచున్నందుకు మదన్ కొంచెం సిగ్గిలి తల వంచుకుని తనలోతాను నవ్వుకున్నాడు. అప్పుడే గోడనున్న గడియారం ఒంటిగంట అయినట్లు సూచించింది. మదన్ లేచి నుంచుని—'దయచేసి ఆజ్ఞయిస్తే ఇంటికి వెళ్ళి మళ్ళీ సాయంత్రం వచ్చి తమను కలుసుకుంటాను.'

'నేను సాయంత్రం ఇంట్లో ఉండను. మీరు రేపుఉదయం రండి. ఇంకోమాట మీరు ఏమనుకోకండి! 'వాంటింగ్' కాలం

లోని అడ్రసులు వ్రాసుకోవాలనేగా మీరు వాడిని పెనిసిల్ అడిగింది ? ఏదైనా ఉద్యోగప్రయత్నం చేద్దామనేనా ? పోనీ ఏదైనా ఉద్యోగం దొరికితే చేరతారా ?'

'ఎందుకుచేరను !'

'ఎంతజీతం ఇస్తే మీ కుటుంబఖర్చుకు సరిపోతుంది ?'

'రెండుపూటలా తిండికీ, బట్టకూ సరిపోతే చాలు.'

'ఇదివరకు ఏదైనా ఉద్యోగం చేశారా ?

'లేదు'

'ఎంతవరకు చదువుకున్నారు ?'

'ఎంట్రెన్సు ప్యాసయ్యాను'

అలాగైతే ముప్పైఖయైదు - నల్భైకంటె ఎక్కువలో దొరకదు ! సరేలెండి చూస్తాను. రేపు ఉదయం రండి.'

మదన్ లేచి ఆయనకు నమస్కరించి ఇంటిముఖంగా బయలుదేరాడు.

---

# 6

మదన్ ఇంటిలో అడుగు పెట్టీపెట్టటంతోటే దాసీది వచ్చి 'బాబూ ఎలాంటివారండీమీరు. మూడురోజులనుండి ఇంటిఛాయలైనా రారాయె ! అమ్మగారు భయపడటంతో జ్వరంకూడా పడ్డది. ఎరిగినచోట్లన్నీ పిలైనప్పుడు చూచివస్తు న్నాను మీకోసం. ఇంట్లో పగలుగడిస్తే రాత్రి, రాత్రిగడిస్తే

పగలుగా ఉంది. కోర్టునుంచి బయలుదేరి ఎక్కడకు వెళ్ళారు మీరు ?'

'జ్వరంవచ్చిందా' అంటూనే మదన్ పెద్దపెద్ద అంగల్లో మేడమీదకు వెళ్ళాడు. దాసీకూడా అతని వెంటే వెళ్ళింది. కిటికీవద్ద కొడుకు నెత్తుకుని నుంచుని ఎటోచూస్తోంది చంప ! కూతురు క్రిందకూర్చుని మిఠాయి తింటోంది.

'జ్వరంవచ్చిందా ?'

మదనుడి ఈ మాటవిని చంప తిరిగి అతనిదగ్గరకువచ్చి కొడుకును అతనికందించింది. పమిటచెంగుతో కళ్లు తుడుచు కుంటూ తలవంచుకుని ఊరికే ఉండిపోయింది. కూతురు మిఠాయి తినటం మాని తల్లిదగ్గరకు పోయి నిలుచుని నీళ్ళు నిండిన కళ్ళతో తండ్రివైపే చూస్తూఉండిపోయింది.

'ఏడవకుచంపా ఇప్పుడేమైందని. ఏడిస్తే జ్వరం ఎక్కువ య్యేను.'

'జ్వరం లేదు'

మదన్ మంచంమీద కూర్చున్నాడు. ఇంతలో దాసీది అందుకుని 'జ్వరం తగలదూ ! ఇంకానయం ఇప్పుడైనా చూడగలిగాము ! మొన్న మధ్యాహ్నమనగా వెళ్ళారు. ఆరోజల్లా చూచాము. ఆవాళ ఎవరికీ తిండీతిప్పలూ, స్నానం పానం ఏమీలేదు. అమర్నాడు నాకే ఏమీతోచక మా బావకొడుకుకి పావలా అర్ధణా ట్రామ్‌చార్జీయిచ్చి నేనే భవానీపూర్ పంపించాను. వాడు తిరిగివచ్చి బాబు— మోహన్ బాబుగారి ఇంటినుంచి వెళ్ళిపోయారని చెప్పాడు. ఈ మాట వినగానే అమ్మగారికి అమితదుఃఖం కలిగింది. ఆ

సాయంత్రానికి జ్వరంకూడా పెద్దపెట్టున వచ్చింది. రెండు దుప్పట్లు జోడించినా చలి ఆగలేదు. శరీరం సలసలా కాలి పోయింది. రాత్రికి రెండురొట్టెలు, కూర చేసి పిల్లలకుపెట్టి తెల్లవార్లు ఈమెను కనిపెట్టుకుని కూర్చున్నాను. ఇంతలో ఆమెమాటలకు పిల్ల అడ్డంవచ్చి—

'నువ్వు మిఠాయికూడా పెట్టావుగా !'

మదన్ భార్యనుచూచి 'నుంచున్నావేం, నీరసంగా ఉంది. యీ మంచంమీాద కూర్చో.'

'నేను పోలీసుకోర్టులో ఉన్న సంగతి నీకెలా తెలిసింది.'

దాసీ ఈ ప్రశ్నకు జవాబివ్వకుండా, 'ఇక తరవాత సంగతులు చెపుతా వినండి. మర్నాడు ఉదయంకు అమ్మ గారికి జ్వరం జారింది. ఎనిమిదిగంటలకు ఎదుటింటిబాబుగారి దగ్గరకు వెళ్ళాను. ఆయనచిన్నకొడుకును పిలచి మీా సంగ తంతా చెప్పి— 'మా బాబుగారు ఎక్కడున్నారో మీాకేమైనా తెలుసునా' అని అడిగాను. ఆయనకు కొద్దిగా గీర్వాణంఉంది లెండి. మొదట వినిపించుకోనేలేదు. మళ్ళా-మళ్ళా అడగ్గా 'నాకు ఇదేపనా? ఎక్కడ త్రాగి దొర్లుతున్నాడో!' అన్నాడు. నేను చాలాసేపు బ్రతిమిలాడుకున్నాను. చివరకు 'ఇది మహా పట్టణం. అనేక లక్షలమంది జనముంటారు. ఎక్కడుంటాడో విచారించాలి. చూస్తానులే' అన్నాడు. తరువాత మూడునాల్గు సార్లు వెళ్ళి జాడ యేమన్నా తెలిసిందా అని అడిగాను. ఏమీా తెలియ లేదని చెప్తూవచ్చాడు. అమ్మగారు ఏడుస్తూ కూర్చుంది. ఉరిపోసుకునో, విషంత్రాగో చచ్చిపోతానన్నారు. చంప మధ్యలో అందుకుని 'సరేలే. నీ సోదెకేంవచ్చె. వెళ్లు

పొయ్యిఅంటించు వంటచెయ్యాలి' అన్నది. మళ్ళీ దాసీది అందుకుని 'ఆమెదుఃఖాన్ని చూడలేక నేనే మళ్ళా మీజాడ తెలుసుకోనేందుకు బయలుదేరాను. దారిలో డాక్టరుగారి కొడుకువిజయుడు కనుపించాడు. అతడే 'మీ అయ్యగారు ఎవరో దొరగారిని బాగాకొట్టాడుట విన్నావా?' అని నవ్వసాగాడు. అదిచూచి 'వారెక్కడ ఉన్నారో నీకు తెలుసా' అన్నాను.

'పోలీసులు పట్టుకు పోయారుట. దొరగారి ముక్కు బ్రద్దలై రక్తంకారేటట్టుగా కొట్టాడు. నాకు చాలా ఆదుర్దా గలిగింది.

'ఎక్కడకు తీసుకు వెళ్ళారు?'

'ఇవాళ లాల్ బజారు పోలీసు కోర్టులో మీ బాబుగారి కేసు విచారిస్తారు. మేమంతా ఈపూట స్కూలు మానేసి చూట్టానికి వెళతాము' అని నవ్వుతూ వెళ్ళిపోయాడు. ఏమండీ అమ్మగారూ. ఆవాళ నేను వచ్చి మీతో చెప్ప లేదూ?'

'అవును చెప్పావు. కానియ్యి. ఈమాటలు తరువాత చెప్పుకోవచ్చు. బజారువెళ్ళి ఓఅర్ధణా పంచదార పట్టుకురా! షరబత్ చేస్తాను. పొయ్యి అంటించి వెళ్ళు.'

సుఖియా వెళ్ళిపోయింది.

'షర్ బత్ అవసరంలేదు. ఇప్పుడే టిఫిన్ పుచ్చుకు వచ్చాను' అని తాను శనివారం ఉదయం ఇంటినుండి బయలు దేరినప్పటినుండి ఇంతవరకూ జరిగిన యావత్తు సంగతులు పూసగ్రుచ్చినట్లు చెప్పుకొచ్చాడు. చివరకు 'చంపా! మనము ఇక తిండికిలేక చావవలశిన అవసరం ఉండదనుకుంటాను.

ఆయన నాకు ఉద్యోగము యిప్పిస్తానన్నారు. ఏమౌతుందో రేపు చూస్తాను' అన్నాడు.

'మీకు తప్పక ఉద్యోగమౌతుంది. భగవంతుడు మనల నెప్పుడూ మరచిపోడు '

చంప స్నానంచేయటానికి వెళ్లినప్పుడు ఇంటివద్ద జరిగిన సంగతులు మిగిలినవన్నియూ సుఖియా తిరిగివచ్చినతరువాత మదన్‌తో చెప్పింది.' 'కేసుమాట తెలిసి బోసుబాబు ఇంటికి వెళ్లి సంగతంతా చెప్పాను. ఆయన అంతావిని 'మరేంఫరవా లేదు ! ఏదో చిన్న దెబ్బలాట కాబట్టి ఇరవైయో యిరవై ఐదురూపాయిలో జరిమానా వేస్తారు అంతే!' అన్నారు.

'అది విని నేను యింటికివచ్చి అమ్మగార్నడిగి గాజులు పట్టుకుపోయి తాకట్టుపెట్టి యాభైరూపాయిలుపట్టుకుని కోర్టుకు వచ్చాను. నేను వచ్చేటప్పటికే డబ్బుకట్టి మిమ్ములను విడి పించుకుని ఎవరో తమబండిలో ఎక్కించుకుని వెళ్లిపోతున్నారు. నేను రెండు మూడుసార్లు మిమ్మల్ని పిలిచాను గాని మీకు వినిపించలేదు!'

## 7

మర్నాడు ఉదయం మదన్ బేలియాఘాట్‌కు ఎనిమిది గంటలవేళకు జేరుకుని శ్రీ ఠాకూర్ జగన్‌మోహన్‌సింగ్‌గార్ని కలుసుకున్నాడు. ఆయన వాకిట్లోనే మదన్‌ను చూస్తూ నవ్వుతూ ఆహ్వానించారు. ఇద్దరూ హాల్లోకివెళ్లి కూర్చు

న్నాక— 'ఇంటివద్ద అంతా కుశలమేనా? ఏ ఇకంగారు పడలేదుగదా ?'

'చాలా ఆదుర్దాపడ్డారు! నిన్ననుదయమే నాజాడ తెలిసింది. ఒకర్నిద్దర్ని అడిగితే నాకు శిక్షపడుతుందనికూడా చెప్పారుట!' అని తాను యిల్లువదిలినప్పటినుంచీ యింటివద్ద సంగతులన్నీ చెప్పాడు. ఠాకూర్ జగన్‌మోహన్ చాలా విచారం వెలిబుచ్చారు. ఆ తర్వాత కొంతసేపటివరకూ ఎవరూ మాట్లాడలేదు. నౌకర్ని పిలిచి ఆయన హుక్కా తయారుచేయమన్నాడు.

'మీరేమన్నా హుక్కా తాగుతారా?'

'అవుసరంలేదు. పుచ్చుకోను. ఏమయింది, ఆ సంగతి ఏమన్నా కనుక్కున్నారా?'

'ఏసంగతి? ఆc! ఉద్యోగం సంగతేనా? నిన్న సాయంత్రం ఈపనిమీదే వెళ్లాను. శ్యాంబజారులో కాళీ బాబు అని నాకో మిత్రుడున్నాడు. 'బ్రౌన్‌జోన్సు' కంపెనీలో ఆయన హెడ్‌క్లార్కు. ఆఫీసులో ఆయనకు మంచి పలుకుబడి ఉంది. ప్రొప్రయిటర్ ఆయన ఎంతచెపితే అంత. ఆఫీసులో తొందరతొందరగా ప్రమోషన్‌లు అయ్యే అవకాశా లున్నాయి. ఆయన్నడిగాను. ప్రస్తుతం ఏమీ ఖాళీలేదన్నాడు. ఎల్లాగన్నా చూడాలన్నాను. దానిపై, ఆఫీసుపని చాలా పెరిగిపోయిందట. అందువల్ల ప్రొప్రయిటరుతో చెప్పి ప్రస్తుతం 'పెయిడ్ అప్రంటీసు'గా వేయిస్తానన్నాడు. జీతం నెలకు యిరవైఅయిదు రూపాయిలకంటె ఎక్కువుండదట!'

'ఇరవైఅయిదురూపాయిలా! ఎల్లాచాల్తాయి?'

'అదే చెప్పున్నాను. ఈరోజుల్లో ఉద్యోగాల పరిస్థితి ఇలా నే ఉంది. ఖాళీరాగానే వందలకొలది ధరఖాస్తులు వస్తున్నాయట. కానీ కాశీబాబుగారు ఒక వాగ్దానం చేశారు. ఈ ఏడాదీ యీ జీతంమీద తృప్తికరంగా పనిచేస్తే వచ్చేసంవత్సరము యాభైరూపాయిలు జీతం చేయిస్తానన్నారు. ఏటా అయిదురూపాయిలచొప్పున ఐదుసంవత్సరాల్లో డెబ్బైఐదు రూపాయిలు జీతంవరకూ చేయిస్తామన్నారు. యిది ఆఫీసులో అన్నిటికంటె తక్కువగ్రేడు. ఫస్టుగ్రేడు ఉద్యోగస్థులకు నెలకు మూడువందల రూపాయిలు జీతం ఉంటుందట. గవర్నమెంటు ఆఫీసులకంటె ఎంతో నయమట. మొదటిసంవత్సరంలో కొద్దిగా కష్టమైనప్పటికీ, తర్వాత అభివృద్ధిలోకి వచ్చేందుకు అవకాశముంది. ఒప్పుకోవటమే మంచిదని నా అభిప్రాయం. ఏమంటారు?'

మదన్ కొంతసేపు ఆలోచించి 'ఒకపూట తిండికి మాత్రమే సరిపోతుంది ఈజీతం.'

'మీ సంసారానికి రోజుకు ఎంత ఖర్చవుతుంది?'

'దాదాపు ఒకరూపాయి కావాలి.'

'నెలకు ముప్పై రూపాయిలు కాదూ?'

'అవును! అదీగాక, చాకలికి మంగలికి వగైరా చిల్లర ఖర్చులుకూడా ఉంటాయిగదా?'

'అయితే పిల్లలకు చదువుచెప్పగలరా?' జీతం తక్కువవచ్చేవాళ్ళు చాలామంది 'ట్యూషన్' చెప్పుకుని జీవిస్తూంటారు! అట్లా ఎందుకు చెయ్యకూడదు?'

'దొరికితే నాకేమీ అభ్యంతరం లేదు.'

'అయితే ఎక్కడకో పోనక్కర్లేదు. మా యింట్లోనే మా మేనల్లుడు స్కూలుఫైనల్ చదువుకుంటూ ఉన్నాడు. ఉదయం ఓమాష్టారు వచ్చి ఇంగ్లీషు, లెఖ్ఖలు చెప్పి వెడతారు. సాయంత్రం హిందీ చెప్పేందుకు ఒకమాష్టార్ని పెట్టాలనుకుంటున్నాను. నెలకు పది రూపాయిలు యిస్తాను. సాయంత్రం ఆరున్నరనుంచి తొమ్మిదిన్నర వరకూ చెప్పాలి. మీకు సమ్మతమైతే—'.

'ఎందుకాకూడదు! తప్పకుండా చెప్తాను. కానీ మీరు చేసిన ఉపకారానికి ప్రతిఫలంగా నేను ఊరికనే చెప్పవలసింది పోయి డబ్బు తీసుకోవటమా! అని ఆలోచిస్తున్నాను.'

'ఫరవాలేదు. కోరి నేను యిస్తూన్నప్పుడు మీరు తీసుకోటానికి భిడియపడతారేం?'

'ఏదోవిధంగా మీరు నాకు సహాయం చేయతలుచుకున్నారు. అందుకని మేనల్లుడి చదువు మిషతో యిలా చేస్తున్నారు. అంతేనంటారా? మీరు యిన్నివిధాల సహాయం చేస్తూన్నందుకు ఎలాకృతజ్ఞత తెలుపుకోవాలో నాకు తోచటంలేదు. భగవంతుడు మీకుసదా ఎల్లప్పుడూ మేలుచేయాలని ప్రార్థిస్తాను'.

ఇంతలో నౌకర్ హుక్కా సిద్ధంచేసి తెచ్చాడు. దానినందుకుని శ్రీజగన్ మోహన్ సింగు మదన్‌కు అందిచ్చాడు.

''కాదు! ఇందులో మిషతో నేనుచేస్తూన్న ఉపకారమేమిన్నీలేదు. ఎట్లాగైనా నాకు వేరేమనిషి కావలసిందేను, ఆపనియెవరుచేస్తే వారికిడబ్బుయివ్వాలి. ఆయిచ్చేది మీకే

యిస్తాను.'' తరువాత ఇద్దరూ కొంత లోకాభిరామాయణం మాట్లాడుకున్నారు. ఈ ఆస్తిఅంతా తన విధవసోదరిది అన్న సంగతి మాటలసందర్భంలో జగన్మోహన్‌సింగ్ తెలియపర్చాడు. తరచు జగన్మోహన్‌సింగే యిక్కడకువచ్చి ఆమెబిడ్డలసంగతి వ్యవహారాలు చూచిపోతూంటాడు. అతడు లేనప్పుడు యిక్కడపనులు చాలారోజులనుంచి ఉంటూన్న ఓగుమాస్తాచూచుకుపోతాడు. 'తాను రెండుమూడు రోజులు మాత్రమే ఉంటాననిన్నీ తనస్వంతవూరుకు వెళ్ళి మళ్ళీచైత్ర మాసంలోగాని యిక్కడకురాననిన్నీ, ఆమాటలసందర్భంలో వ్యక్తంచేశాడు.

ఆరోజుకు మూడురోజులుంది నెలాఖరు. 'ఒకటవ తేదీ ఉద్యోగములో ప్రవేసించవచ్చును. ఆరోజునుంచే ట్యూషన్‌కూడా ప్రారంభించండి. వెళ్లి మధ్యాహ్నమురండి. ఆఫీసు హెడ్‌గుమాస్తాకు మిమ్మల్ని చూపించి పరిచయం చేస్తాను' అన్నాడు జగన్‌మోహన్‌సింగ్.

మదన్ అప్పటికి శలవు పుచ్చుకుని ఇంటికి వెళ్ళి పోయాడు. ఇంటివద్ద యావత్తు సంగతులు చెప్పి భోజనానంతరం కొంతసేపు విశ్రమించి మళ్ళీ మూడుగంటలవేళకు జగన్‌మోహన్‌సింగ్ కోరినప్రకారం అతని యింటికి జేరుకున్నాడు. అచ్చటనుంచి వారిద్దరూ ఆఫీసుకు వెళ్ళారు. మదన్‌ను శ్యాంబాబుకు పరిచయంచేసి జగన్‌మోహన్‌సింగ్ ఉద్యోగం స్థిరపరిచి వచ్చాడు. ఇద్దరూ తిరిగివచ్చేటప్పుడు— 'సరే వెళ్లిరండి— ఇంకొకమాట; మీ గృహపరిస్థితి చెప్పనే చెప్పారు. నెలాఖరున జీతంవచ్చేటంతవరకూ ఇంటివెచ్చంకు ఎలాగడుపుకుంటారు ?'

'ఏంచేస్తాను; దానికో ఉపాయం ఆలోచించాను. నిన్న చెప్పానుగదా. సుఖియాగాజులు తాకట్టుపెట్టి తెచ్చిన యాభైరూపాయిలు ఉన్నాయని అందులో కొంత ఉంచుకుందామని అనుకుంటున్నాను.'

'అలాకాదు. నేనొక ఉపాయం చెబుతాను వింటారా?'

'చెప్పండి'

సుఖియా తెచ్చినడబ్బు ఖర్చుపెట్టకు. అది వాపసు చేసెయ్యి. వడ్డీ పెరిగిందంటే అసలు తీర్చలేవు. ఎల్లుండినుంచి మా మేనల్లుడికి చదువు ప్రారంభించి, వెళ్లేటప్పుడు ఒక రూపాయి తీసుకు వెళ్ళు. ఈవిధంగా ముప్పయిరోజులూ ఒక రూపాయిచొప్పున తీసుకు వెళ్ళుతూఉండు. అందులో పది రూపాయిలు నెలాఖరుకు మీకు రావలసినవేగా. ఇక ఇరవై రూపాయిలు మాకు బాకీఉంటారు. మీకు ఆఫీసులో ఇచ్చే ఇరవైఐదురూపాయిలలో మా ఇరవైరూపాయిలు ఇచ్చివేయండి. మిగిలిన అయిదురూపాయిలతో నెల మొదటి ఐదు రోజులు గడుపుకోండి. ఆరోజునుంచి మళ్ళా రోజూ రూపాయిచొప్పున మావాడివద్ద తీసుకోండి. ఇలా రెండో నెలాఖరు అయ్యేటప్పటికి మీ పదిరూపాయిలుపోను పదిహేనురూపాయిలే బాకీఉంటారు. ఆ నెల్లో మా బాకీపోను మీ జీతంలో పదిరూపాయిలు మిగులుతవి. ఆ పదిరూపాయిలు పదిరోజులు వాడుకున్నాక, పదకొండోరోజునుంచి మళ్ళీ రూపాయిచొప్పున తీసుకోండి. జీతం రాగానే మా బాకీ మాకిచ్చివేస్తే ఆ నెల్లో పదిహేను మిగులుతవి. ఈవిధంగా ఆరు మాసాలు గడిచేప్పటికి మీ చేతిలో ముప్పైఫరూపాయి

లుంటవి. ఇక మీరు అప్పు తీసుకోవలసిన అవసరం ఉండదు. ఏమంటారు ?'

'మీరు చెప్పిన ఈ సలహా చాలాబాగుంది. తప్పక అలాగేచేస్తాను.'

'ముప్పైరూపాయిలు ఒక్కమారే ఇవ్వకుండా రోజూ ఒకొక్కరూపాయే తీసుకోమన్నానేమో' అని అనుమానించ టంలేదుగదా ?'

'నేను మిమ్మల్ని శంకించేటంతటి మూర్ఖుణ్ణి కాను. మీరిచ్చిన ఈ సలహా నా మేలుకొరకేనని నేను ఘట్టిగా నమ్ముచున్నాను.

'మీ పరిస్థితి బాగుపడవలెననే నా ఆశయం. ఒక్క సారిగా డబ్బు చేతికివచ్చినప్పుడు జాగ్రత్తగా ఖర్చుచేయటం చాల కష్టమైన విషయం. ఆ కారణంగా ఋణములు చేయ వలసివస్తుంది. ఎంత క్లిష్టపరిస్థితులలోనూ అప్పుచేయకుండా ధైర్యముతో దైవమునే నమ్ముకొని చెడు నడతలకు లోను గాకుండ మన ప్రయత్నముతో మనమే వ్యవహరించుకోవాలి. అప్పుడే మనకు జయం లభిస్తుంది. ఇది ఎన్నటికీ మరువవద్దు.'

# 8

బ్రౌన్‌జోన్సు కంపెనీ హెడ్‌క్లార్కు శ్రీ లాలాకాశీ నాథ్‌బాబు కాయస్థుడు. ఆయనవయస్సు అప్పటికి 48 సంవ త్సరములు ఉంటుంది. అయితే సర్వీసురిజిష్టరు దాఖలా 35 సంవత్సరాలు మాత్రమే ఆయనవయస్సు. లావుగాఉండి

చామనచాయగా ఉంటాడు. తలపూర్తిగా నెరసినది. గడ్డము, మీసముకూడా నెరుస్తోంది. నల్లనిసర్జికోటు తొడుక్కొని దానిపై పల్లాటుకండువా మడతవేసుకొని తలపై టోపీతో బయలుదేరి ట్రాంబండిలో ఫస్టుక్లాసులో కూర్చుని నిత్యా ఆఫీసుకువస్తూఉంటాడు. కచ్చేరీకిరాగానే కండువావంకీన వేసి, టోపీతీసి తనస్థానంలో కూర్చుంటాడు. ఇంటివద్దనుంచి వచ్చేటప్పుడు రోజూ ఆరౌన్సులసీసాలో ఏదోమందుకూడా తెచ్చుకు బల్లమీదపెట్టుకొని అలసటగా ఉన్నప్పుడు ఒకఔన్సుగ్లాసులో పోసుకు త్రాగుతూఉంటాడు. మంచిఘాటైనమందేమో అది పుచ్చుకున్నప్పటినుంచి ఉషారుగా ఉంటూఉండేవాడు. అప్పుడప్పుడూ జేబులోంచితీసి రెండుఏలక్కాయలుకూడా వలిచి నోట్లోవేసుకుని పనిచూచుకుంటూ ఉండేవాడు.

కంపెనీలో వీరికి ఎంతో పలుకుబడియుంది. ఆఫీసులో వీరంటేఅందరూభయభక్తులతో ఉంటారు. వీరెంతచెపితేఅంతా యజమాని చేయవలసిందే! అందువల్లే 'మదన్‌కు' వెంటనే ఉద్యోగము వేయగలిగాడు! మంచిహృదయం కలవాడు కూడాను.

ఆమరుసటిరోజు ఒకటవతేది. మదన్ ఆరోజుఉదయం ఉద్యోగంలో ప్రవేశించాడు. అయిదుగంటలతరువాత ఆఫీసు నుంచి తిన్నగా ఇంటికివెళ్లి కాళ్లుచేతులు కడుక్కొని కొంతసేపు అలసట తీర్చుకున్నతరువాత సుఖియా తెచ్చిన టీ పుచ్చుకుని ఏడున్నరఅయ్యేటప్పటికి ట్యూషన్‌ప్రారంభించుటకు ఠాకూర్ మోహన్‌సింగ్‌గారింటికి వెళ్లాడు. వచ్చేటప్పుడు ఖర్చుకోసం అడ్వాన్సుగా ఒకరూపాయి ఆయనమేనల్లుడివద్ద పుచ్చుకుని

ఇంటికిబయలుదేరాడు. అప్పటికి పదిగంటలుదాటటంవల్ల బజారులో కొట్లన్నీ మూసివేశారు.

ఈవిధంగా రోజులు గడిచిపోతున్నాయి. క్రొత్తలో మదన్ ఎప్పుడూకష్టపడి యెరుగనివాడవటంవల్ల కష్టంతోచినా రానురాను అలవాటయిపోయింది. తనలోకలిగిన మార్పును గురించి తలచుకున్నప్పుడల్లా ఒళ్లుగిలిగింతలు పెట్టినట్లుంటేది. ఆఫీసులో పగలంతా పనిచేసివచ్చి మళ్ళీట్యూషన్‌కు వెళ్లి వచ్చేటప్పటికి రాత్రిపదిగంటలయ్యేది. తానుచేసిన తప్పులను గురించి పశ్చాత్తాప పడేందుకుకూడా సమయంచిక్కేదికాదు. ఇంటికివచ్చి భోజనంచేసి పడుకోగానే మంచినిద్రపట్టేది. లోగడ అనేకచింతలతో గాయపడిఉన్న హృదయానికి యీ విధంగా విశ్రాంతిచిక్కింది.

ఈవిధంగా ఒకటితరువాత ఒకటిగా ఆరుమాసాలు గడిచిపోయాయి. ఉద్యోగములో ప్రవేశించినక్రొత్తలో మద్య శాలలు కనుపించినప్పుడు కొంతమనస్సు చెలించినప్పటికీ, ఈఆరుమాసాలల్లో ఒక్కనాడుకూడా అతను సారాయమును గూర్చి ఆలోచించనుగూడా ఆలోచించలేదు. మీదుమిక్కిలి జేబులో డబ్బులుకూడా ఉండెడివికావు. ఇంటిఖర్చుకుపోను మిగిలిన చిల్లరేమైనాఉంటే భార్యచేతికిఇచ్చే బయటకివచ్చే వాడు. బిడ్డలుకష్టపడటం అతనుచూడలేడు. డబ్బు వారికి కాదని తన దుర్వ్యసనములకు ఖర్చుపెట్టరాదని గట్టిగా నిర్ణ యించుకున్నాడు.

శ్రీఠాకూర్ జగన్‌మోహన్ సహవాసమునుసరించటం వల్ల ఏదోనెలప్రారంభానికి మదన్‌చేతులో ముప్పైరూపాయలు

నిలవఉంది. ఆదివారంనాడు ఆడబ్బులోనుంచి నెలకు కావలసిన సరుకులన్నీ కూరలుమినహా కొని ఇంటికిచేర్చాడు. ఈ ఏడు మాసముల్లోగా జగన్ మోహన్ సింగు రెండుమారులు కలకత్తావచ్చి ఒకటిరెండురోజులుండి మళ్లీతనగ్రామం వెళ్లిపోయాడు. మళ్లీఆయన కార్తీకమాసారంభంలో వచ్చాడు. మదన్ ఆయన్ని కలుసుకున్నప్పుడు కుశలప్రశ్నలయిన తరువాత 'మీఅప్రంటీస్ కాలం పూర్తయేందుకు యింకాఎంతకాలముంది?'' అని అడిగాడు.

''పదినెలలు అయింది. ఇంకా రెండుమాసములు పూర్తికావాలి.''

''ఈరెండునెలలూ అయిపోయినతరువాత, జీతం యాభైరూపాయలకు పెంచుతారనుకుంటాను.''

'ఈనెలాఖరుకు నాకు 'కాన్ఫిడెంషల్ రిపోర్టు' యిస్తారు. నాప్రవర్తన మంచిగాఉన్నట్లు యిస్తే వచ్చేనెలాఖరునుంచి యాభైరూపాయలుమీద ప్రమోషన్ యిస్తారు.'

'మరి ఓవేళ మీకుఅనుకూలంగా రాయకపోతేనో?'

'మేడాదిపూర్తికాగానే ఉద్యోగంనుంచి తొలగిస్తారు.'

'మీమీద హెడ్ క్లార్కుగారు అభిమానంతో ఉంటున్నారా?'

'ఇప్పటివరకు మంచిగానే ఉంటున్నారు.'

'అయితే యికనేం! వారు మిమ్మల్ని గురించి మంచిగానేవ్రాస్తారు. మంచివాడుకూడాను.'

మరునాడుఆదివారం. ఆరోజు ఠాకూర్ మోహన్‌సింగ్ మదన్‌ను విందుకుఆహ్వానించాడు. మదన్ స్నానాదికృత్యాలు తీర్చుకుని, తొమ్మిదిగంటలకు వారియింటికి విందుకు హాజరయ్యాడు. ఇద్దరూ కొంతసేపుకూర్చుని, మదన్ కుటుంబవిషయాలను, ఆఫీసువిషయాలు, హెడ్‌గుమస్తా సంగతులు ఇంకా ఏదో పిచ్చాపాటి మాట్లాడుకున్నారు.

'మీరు ఆయింట్లో రెండుమాసములుమాత్రమే ఉండవచ్చుననుకుంటా! తరువాత అద్దెయింట్లో ఉండవలసిందేగా?'

'అవును. ఈ పేటలోనే ఒకచిన్న ఇల్లునుచూచుకున్నాను. ఆయిల్లు యింకా ఖాళీకాలేదు. అదికూడా సరిగా ఆరోజుకే ఖాళీఅవుతుంది.

'ఈ పేటలోనా? ఎక్కడ?'

'మాయింటికి కొద్దిగా ఎడమవైపు తరువాత ఉత్తరం వైపునఉన్న సందులోఉంది. చిన్నయిల్లు, పైనరెండుగదులు, క్రిందరెండుగదులూ ఉన్నాయి.

'అద్దె ఎంత?'

'నెలకు పదిహేను రూపాయలు'

'సరే, ఇదొకటా? రెండునెలల తరువాత జీతం పెరుగుతుందంటే, మళ్ళీయిదో పదిహేనురూపాయలు ఖర్చా!'

'ఏదోవిధంగా కష్టపడాలిమరి. ఏమిచేయగలం!'

ఆరోజుతరువాత జగన్‌మోహన్ మరిరెండు రోజులకు వూరుకు వెళ్ళిపోయాడు. వెళ్ళేటప్పుడు మదన్‌తో రెండు మాసములకుగాని రాలేనని చెప్పిపోయాడు.

# ౭

పైవిషయాలు జరిగిన కొద్దిరోజులు తరువాత కాశీ బాబుగారు తనపై పూర్వపు అభిమానంతో ఉండటం లేదని ఆయన ప్రవర్తనవల్ల మదన్ గ్రహించాడు. ప్రతిచిన్న పనిలోను తనుచేసిన తప్పులనుఎంచి చిర్రుబుర్రుమనడం ప్రారంభించాడు. చీవాట్లుకూడా వేయసాగించాడు.

ఓరోజు ఉదయం మదన్ తోటిగుమస్తా కాళీచరణుడు మదన్‌ను చాటుకుతీసుకువెళ్ళి 'హెడ్‌గుమస్తా నీమీాద ఎందుకుకోపంగా ఉంటున్నాడో నీకు తెలుసా ?' అని అడిగాడు.

'నాకు తెలియదు. మీాకు తెలిస్తే చెప్పండి.'

'నీకు జగన్‌మోహన్‌సింగుగారు తెలుసా ?'

'ఆ ! బాగా ఎరుగుదును.'

'వారు ఎప్పుడు వచ్చారు ?'

'ఈమధ్యనే. వారేనాకీఉద్యోగం ఇప్పించిందికూడాను'

'అలాంటప్పుడు ఎందుకుచేశావు ఈవిధంగా ?'

'ఏం చేశానంటున్నారు !'

'మీారే ఆలోచించుకోండి. పెద్దబాబుగార్ని గురించి మీారు వారితో ఏదోచెప్పారటగా? దానిమూలానే యింత మునిగింది.'

'ఏమని చెప్పానంటారు ?'

'పెద్దబాబుగారు తాగుబోతని చెప్పారుటగా! మందు అనేనెపంతో బ్రాందీ గంటగంటకూ తాగుతారని మీారు

ఆయనతో చెప్పారుట. మొన్న శనివారం సాయంత్రం బాబుగారు ఆయన యింటికి వెళ్ళినప్పుడు వారే చెప్పారుట.

తాను, జగన్‌మోహన్‌గారు విందుకు వెళ్ళినప్పుడు మాటలసందర్భంలో మందుసీసా సంగతివచ్చింది గాని, అది మందుకాదు బ్రాందిఅనిగానీ పెద్దబాబుగారు తాగుతారని గానీ నేచెప్పలేదని మదన్ కాళీచరణ్‌తో చెప్పాడు.

'అదా సంగతి. ఒకటికి రెండు కల్పిస్తారు. పుచ్చిందంటే పురుగులు పట్టాయంటారు. అప్పుడప్పుడూ మీరు పెదబాబు గారింటికి వెళ్ళి వార్ని పొగడుతూ ఉండండి. ఇవి ఆశ్రయించి బతకవలసినరోజులు. మేమంతా ప్రతిశనివారం వారియింటికి వెడుతూనే ఉంటాము. మీరుకూడా మాతో వస్తూఉండరాదూ'

'మీకేమిః చెప్తారు. సరిపడినంత జీతంవస్తుందిమీకు. కూర్చుని కబుర్లుచెప్పుకు నేందుకు వీలువుంటుంది. నాకో జీతం తక్కువ. బీదవాణ్ణి. పొట్టగడపటమే కష్టంగా ఉంది. శని వారం అక్కడకివస్తే ఎట్లాగడుస్తుంది. ట్యూషన్ చెప్పుకోవాలి.'

'మిమ్మల్ని డబ్బు ఖర్చుపెట్టమని ఎవరూ చెప్పటం లేదు. ఆరోజు భోజనాలు వగైరాఖర్చులన్నీ బాబుగారే భరిస్తారు. మీకిష్టమైతే భోజనం చెయ్యొచ్చు లేకపోతేమానండి కూర్చునికబుర్లు చెప్పుకొని సాయంత్రం ఇంటికి వెళ్ళిపోవచ్చు. సారావగైరా తాగనవసరంలేదు.'

మరుసటి శనివారం కాళీచరణ్‌తోబాటు మదన్ పెద్దబాబుగారింటికి వెళ్ళాడు. అతిథులందరూ మధుసేవలో

నిమగ్నులైయున్నారు. మదన్ దూరంగా వెళ్ళి ఒకప్రక్కన కూర్చున్నాడు. మద్యాన్ని పుచ్చుకోమని వాళ్ళలో కొందరు మదన్‌ను బలవంతపెట్టారు. పెద్దబాబుగారుకూడా ఒకటిరెండు పర్యాయాలు హెచ్చరించారు. కాని మదన్ సమ్మతించలేదు. ఇప్పుడు అతనికి దానియందు అభిలాషకూడా లేదు. పైగా అక్కడిపరిస్థితి చూస్తూంటే అతనికి ఏవగింపుకూడా కలిగింది. అయినప్పటికి ఉద్యోగము నిలబెట్టుకొనుటకు మరి రెండు శని వారములుకూడా యిక్కడకు రావలసివచ్చినది. యేలాగైనా మద్యమునుమాత్రము ముట్టుకొనియుండలేదు!'

మదన్ పెద్దబాబుగారింటికి వెళ్ళిన రెండువారములు ఆఫీసులో సద్భావమునే ప్రకటించుచున్నారుగాని ఈ సోము వారమునుంచి ఎందుకోమరల కోపగించుకుంటున్నారు. ఎందు వల్ల ఇలాజరుగుచున్నదో అతనికి తెలియదు. మంగళవారము ఆఫీసునుంచి సాయంత్రము ఇంటికిపోవునపుడు కాళీచరణుడు దగ్గరకుపిలచి

'మీకు ప్రపంచంలో ఎట్లావ్యవహరించాలో తెలియదు సంవత్సరం పొడుగునాకష్టపడి చివరకు వ్యవహారం చెడగొట్టు కున్నారు!'

'ఏమిటి?'

'శనివారంనాడు పెదబాబుగారు బాగాత్రాగి తందనా లాడారని చెప్పారుటగాదా?'

'ఏమిటీ! నేనెవరితోనూ చెప్పలేదే!

'ఏమోమరి. పెదబాబుగారు ఎవరిపేరూ చెప్పలేదు. కానీ ఎవరోపెద్ద నమ్మదగినమనిషి చెప్పారని పెదబాబుగారే

అన్నారు. ఈమాట చెప్పేటప్పుడు వారికిపట్టరానంత కోపం వచ్చింది. 'మనఆఫీసులో యిలాటిమనిషిని ఉంచరాదనికూడా అన్నారు. ఇంటిగుట్టు చెప్పేవాళ్ళని ఇంట్లోంచి వెళ్ళగొట్టాలి అన్నారు. ఏమంటారు! మీరేమన్నా ఆర్యసమాజికులా?'

'అబ్బే! కాదండీ. నాకు కాళీ, దుర్గ, మహాదేవుడు-అందరు దేవతలంటేనూ నమ్మకముంది.'

'అయితే మీరొకపని చెయ్యండి. మాలోవారేవని పెద్దబాబుగారికి నమ్మకంకలిగేటట్లు ఏదైనా ఒకపనిచెయ్యండి.'

'ఏం చెయ్యమంటారు నన్ను?'

'ఒకటి రెండు శనివారాలు బాబుగారింటికి వచ్చినప్పుడు మీరుకూడా వారితోబాటు బ్రాందీ, విస్కీ పుచ్చుకోండి. దాంతో పెద్దబాబుగార్కి మీమీదఉన్న అనుమానం కాస్తా పోతుంది.'

మదన్ చేతులుజోడించి, క్షమించండి. 'ఆపని నాచేత గాదు. నేను ఎవరితోనూ వారినిగురించి నిందిస్తూ మాట్లాడలేదు. ఇదివరకుగాని, యికముందుగాని, నేనట్లామాట్లాడేవాణ్ణిగానని పెద్దబాబుగారికి దయచేసి మీరు నచ్చజెప్పండి'.

'నాకేమీ అభ్యంతరంలేదు. నేను నచ్చచెప్తాను. కాని వారు నామాటమీద నమ్మకం ఉంచాలిగదా?'

ఆమరుసటి శనివారం మదన్ పెద్దబాబుగారింటికి వెళ్ళలేదు. సోమవారం ఆఫీసులో కాళీచరణుడువచ్చి 'మొన్న బాబుగారింటికి రాలేదేమి?' అని అడిగాడు.

'అక్కడకు రావటంవల్ల లేనిపోని అపవాదులు వస్తున్నాయని రాలేదు.'

'మీరు రాకపోవటంవల్ల చాలా పొరపాటు చేసినవారయ్యారు. మీరు రానందుకు పెద్దబాబు గారేమన్నారో తెలుసా ?'

'ఏమన్నారేమిటి ?'

'మనమీద పితూరీలు చెప్పేఉంటాడు. అందుకనే మొహం చెల్లక యిక్కడకు రావటం ఎగవేస్తున్నాడు. పైగా రేపు పెద్దదొరగారికి వ్రాసే వార్షికనివేదికలో మీరు మన కంపెనీలో ఉద్యోగానికి పనికిరారని వ్రాస్తానని కూడా అన్నారు.'

'ఈమాట వినగానే మదనుడి నెత్తిపై మిన్నువిరిగి పడ్డట్టయింది. తనకు యాభై రూపాయలు నెలజీతంమీద ఉద్యోగం ఖాయమవుతుందని కలలుగంటున్నాడు. ఈమధ్య! పదిహేనురూపాయలు యింటి అద్దెకు పోయినప్పటికి, ఇది వరకటికంటె చేతిలో పదిరూపాయలు అదనంగా మిగులుతవి. ఇకమీద ఇంటిఖర్చుకు యిబ్బందిపడ నవసరముండదని అనుకుంటున్నాడు. ఇట్లాంటిపరిస్థితిలో మళ్ళీ ఈ అవాంతరంవచ్చి పడింది. అందులోనూ రెండురోజుల్లో పెద్దబాబుగారు వార్షిక నివేదిక పంపవలసి ఉందనగానూ. ఆయన నేను ఉద్యోగానికి పనికిరానని నన్నుగురించి వ్రాస్తే నా ఉద్యోగం ఊడటం ఖాయం. ఉద్యోగంపోతే సంసారం గడవటంఎలా ? ఇంకో నెలకు ఈఇల్లుకూడా ఖాళీచెయ్యవలసిఉంది. ఆపరిస్థితుల్లో ఎక్కడ ఉంటాను. ఏమి తింటాను.' అని విచారపడసాగాడు.

ఆ తరువాత రెండురోజులకు ఆఫీసులో గుమస్తాలందరూ అల్పాహారవిందు చేసుకున్నారు. ఆ సమయంలో సిగరెట్లుకాలుస్తూ ఖులాసాగా మాట్లాడుకుంటున్న సమయంలో

కాళీచరణుడు మదన్ దగ్గరకువచ్చి 'బాబుగారు మిమ్మల్ని గురించి ఏమి వ్రాశారో అయిదుగంటల తరువాత మరికొంచెం సేపు ఉండండి, వారు యింటికి వెళ్ళిన తరువాత చూపెడతాను.' అన్నాడు.

మదన్ అయిదుగంటలు దాటిన తరువాతకూడా ఏదో పనిచేస్తూన్నట్లు నటిస్తూ ఆఫీసులోనే ఉండిపోయాడు. అయిదు గంటలు కొట్టగానే పెద్దబాబుగారు ఆఫీసునుంచి వెళ్ళిపోయారు. తరువాత యితర గుమస్తాలుకూడా ఒక్కరొక్కరే ఒక పావుగంటలో వెళ్ళిపోయారు. అప్పుడు కాళీచరణ్ పెద్ద బాబుగారి రికార్డుబాక్సు తెరిచి మదన్‌ను గురించి వ్రాసిన రిపోర్టుతీసి, అతనికిచూపెట్టాడు. దానిలో 'మదన్‌సింహుడు పనిసరిగా చేయలేదు. సంవత్సరము పూర్తికాగానే అతనిని పనినుండి తీసివేయవచ్చును.' అనిఉంది.

'దీనిని చూచేప్పటికి మదన్‌కు ప్రపంచమంతా అంధకార బంధురమైనట్లగుపించింది. మనస్సంతా చీకాకుపొంది అయోమయంగా తోచింది. నెత్తినచేయిబెట్టుకొని అట్లానే ఆకుర్చీలో కూలబడిపోయాడు. కాళీచరణుడు మిత్రునికి గలిగిన కష్టాన్నిచూచి చాలా విచారపడ్డాడు. మిత్రుణ్ణి ఓదారుస్తూ 'విచారించకండి. సాయంత్రం బాబుగారింటికి వెళ్ళి వారికి నచ్చచెప్పి చూస్తాను.'

'నేనుకూడా మీతోరానా?'

'ఇవాళ మీరు రావటం మంచిదికాదు. వారి పరిస్థితి ఎలాఉంటుందో? మిమ్మల్ని పిలుచుకు రమ్మంటే అప్పుడు రావచ్చును.'

'వారు ఏమన్నారో నాకు ఎలాగా తెలిసేది? రాత్రికి మీా యింటికి రమ్మన్నారా?'

'మా యింటికి వస్తానంటారా? అయితే రాత్రి తొమ్మిదింటికిరండి. ఈలోగా వారింటికి వెళ్ళి మాట్లాడి వస్తాను.'

సరేనని మదన్ విచారంతోను దిగులుతోను ఇంటి ముఖం పట్టాడు.

*　　*　　*　　*

ఈమధ్య చాలారోజులనుంచి భర్తముఖంలో ఏదోమార్పు వ్యక్తమౌతుండటం చంపావతి కనిపెట్టుతూనేవుంది. నేడు మదన్ ఆఫీసునుంచి విచారముఖంతో ఇంటికి రావటంచూసి–

'ఏం! అలావున్నారు?' అని అడిగింది.

'తరువాత చెపుతాను అంటూ, బాత్‌రూమ్‌లోకి వెళ్ళి కాళ్ళుచేతులు కడుక్కునివచ్చి, కొంచెంసేపు మంచంమీాద కూర్చుని, అలసట తీరాక మళ్ళీ ట్యూషన్ చెప్పిరావటానికి బయటకు వెళ్ళిపోయాడు. ట్యూషన్ చెప్పటం పూర్తికాగానే అక్కడనుంచే తిన్నగా కాళీచరణబాబు యింటికి వెళ్ళాడు. అప్పుడు ఎనిమిదిన్నర మాత్రమే అయింది. కాళీచరణబాబు యింకా యింటికి రాలేదు. ఆయన వచ్చేటంతవరకు అక్కడే కూర్చుని ఉండిపోయాడు. తొమ్మిది, తొమ్మిదింపావయ్యేటప్పటికి కాళీచరణబాబింటికి వచ్చాడు. తిన్నగా ఆయన ఇంట్లోకి రాకముందే ఎదురుగావెళ్ళి ఆదుర్దాతో 'ఏమయింది?' అని అడిగాడు.

'చాలాచెప్పి చూచాను. ప్రయోజనం లేకపోయింది'.

'ఏమన్నా రేమిటి?'

'మదన్‌సింగ్ మనందర్నీ అవమానపరుస్తున్నాడు. అందువల్ల అతన్ని మన ఆఫీసులో ఉంచటంమంచిదికాదు' అన్నారు. దానిమీద నేను చాలాచెప్పి చూశాను. ఆయనదెంత సేపటికీ ఒక్కటేమాట! నేనూ అంతటితో ఒదిలిపెట్టలేదు. ఆఖరుకు ఆయన– 'రేపు విందుకువచ్చి మనతోబాటు బ్రాందీ– విస్కీ– పుచ్చుకుని' తాను మనలను దూషించనట్లు ఋజువుపర్చుకోవనను. అప్పుడు మనపై పితూరీలు చెప్పినది యీతడు కాదని నేను నమ్మగలను. అలాచేసినచో నేను ఆరిపోర్టు చించివేసి, వేరే రిపోర్టు వ్రాసెదను' అన్నారు. దానికికూడా నేను చాలా చెప్పి చూచాను. 'అతను బ్రాందీ తాగనని ఒట్టువేసుకున్నాడని– ఈ స్వల్పవిషయానికి మీరు అతని పొట్టపై కొట్టవద్దని' కూడా చెప్పాను. దానికి ఆయన 'ఎందుకు తాగడూ? అతని సంగతంతా నాకు తెలుసు. ఆ విషయములన్నీ జగన్మోహనుడు నాతో చెప్పినాడు. ఒకప్పుడు ఈ మహానుభావుడే సీసాలకు సీసాలే ఎత్తినది దించకుండా త్రాగేవాడుట. అటువంటిది ఇప్పుడు మర్యాదకోసరమని ఒకసారి మాత్రమే ఒక గ్లాసెడు త్రాగినందువల్ల మునుచుకుపోయిందేమీలేదు' అన్నారు. నేనెంత చెప్పినా ప్రయోజనం కనబడలేదు' అన్నాడు కాళీచరణబాబు.

మదన్ తన రెండుచేతులూ నెత్తిన పెట్టుకుని కళ్ళు మూసుకుని తన దురదృష్టమునుగూర్చి విచారపడసాగాడు.

'ఏమంటారో చెప్పండి. కళ్ళు మూసుకుని మందు త్రాగినట్లు వారి ఎదుట ఒకగ్లాసు విస్కీ త్రాగండి. మీ ఉద్యోగంకోసం. తద్వారా మీ భార్యాపిల్లల్ని పోషించుకునే నిమిత్తం. ఒక్కసారి వ్రతభంగంచేసినా దోషముండదు.

అని మీతో చెబుదామని నేను మనస్సులో అనుకుని, ఈ సంగతంతా మీతో చెప్పి ఒప్పించగలననే ధైర్యంతో బాబుగారితో అందరియెదుటా గాకుండా, మీరు నేనూ మదన్ మనము ముగ్గురమేఉన్నప్పుడు ఒక గ్లాసు మాత్రమే మీ అనుమానము తీర్చుటకు త్రాగుననని చెప్పి రేపటివరకూ రిపోర్టు పంపకుండు నట్లుగా మాట పుచ్చుకుని వచ్చాను. ఏమంటారు. పోనీ మీరు ఇంతమాత్రమునకైనా సమ్మతిస్తారా ?'

ఇదంతయూ వినేప్పటికి మదన్‌కు గొంతు ఆరుకు పోయింది. చాలాసేపు ఆలోచించి అతికష్టంమీద రేపు కచ్చేరీకి వచ్చినప్పుడు ఏసంగతీ చెపుతాను' అన్నాడు.

'సరే. బాగా ఆలోచించుకునే చెప్పండి. ఒక్కరోజు మద్యము పుచ్చుకున్నంత మాత్రమున చెడిపోయిందేదీ లేదు. ఈ పరిస్థితిలో నా అభిప్రాయ మడిగినచో త్రాగవలయుననే చెప్పెదను. ఇంటివద్ద ఆలోచించియే యేసంగతీ రేపు సాయంత్రము తేల్చిచెప్పండి. ఇద్దరము కలిసే పెదబాబుగారింటికి వెళదాము !

# 10

మదన్ యింటికివచ్చి ఆ విచారముతోనే కొద్దిగా భుజించి పడుకున్నాడు. ఇదివరకు పడుకొనగానే ప్రయత్నము లేకుండగానే నిద్రపట్టేది. కాని ఈరోజు ఎంతప్రయత్నించినా అతనికి నిద్రపట్టటంలేదు. అతని ముందున్న సమస్యే అతన్నీవిధంగా బాధిస్తోంది. వ్రతభంగం గాకుండా చూచుకోవటమా ? లేక ఉద్యోగం నిలబెట్టుకోవటమా ? అనే ఇప్పు

డతనికి సమస్య. ఏది ముఖ్యం. ఉద్యోగం వదులుకుంటే... రేపటినుంచి తిండికి గతి ఏమిటి? అనే ఆలోచన వచ్చేటప్పటికి అతని మనస్సు వికలమైపోయింది. ఉద్యోగం పోనున్ననాడే తానున్న యిల్లుకూడా కాళీచేయవలసి ఉంటుంది. ఆపదమీద ఆపద. తాము బాల్యంలో చదువుకున్న 'విపద్విపదం- సంప త్సంపద మనుబధ్నాతి- సంపదను సంపద, ఆపదను ఆపద పిలుచుకుని వచ్చును'. అను శ్లోకము జ్ఞాపకమునకు వచ్చింది. ఇప్పుడు తన్ను ఈ రెండు ఆపదలూ నోరు తెరుచుకు మ్రింగ వస్తూన్నట్లనిపించింది. ఈ రెంటివెనుకా యింకా ఎన్ని ఆపదలు రానున్నవో! ఎవరికి తెలుసు అని ఆలోచించసాగాడు. ఎంత ఆలోచించినా అతనికి సమస్యా పరిష్కారం కాలేదు. ఎంత ప్రయత్నించినా నిద్రపట్టటంలేదు. ఆలోచనలమీద ఆలోచ నలు ఎక్కువయాయి.

'నేను జగన్మోహనునితో ఆరోజున హెడ్‌గుమాస్తా గారి మందుసీసాను గురించి విపరీతముగా ఏమియూ చెప్ప లేదు. అయినా ఏల చెప్పితిని. దానిని పురస్కరించుకునే ఈ అభాండం నానెత్తిన రుద్దబడింది. యిప్పుడు దానినిగురించి విచారించుటవల్ల ప్రయోజనంలేదు. ఈ సమయంలో జగన్ మోహన్‌గారితో చెప్పుకుని పెద్దబాబుగారికి వారితో చెప్పి ద్దామన్నా వూళ్లోలేరు. మరి మూడుమాసముల వరకూ కలకత్తాకు రారు. పోనీ యే ఉత్తరము వ్రాసో లేక టెలి గ్రాము యిచ్చో పని జరుపుకుందామంటే టైములేదు. రేపు సాయంత్రంకు ఏదో తాడో బేడో తేలాలి. ఎల్లుండే దొరగారికి రిపోర్టు పంపవలసింది. దొరగారు దానిమీద సంతకం పెడ తారు, ఆరోజుతో మనఉద్యోగం సరి. ఇక పిల్లలూ మేమూ

వస్తులుండవలసిందే. పోనీ ఇంకే ఆఫీసుకన్నా దరఖాస్తు పెట్టు కుందామన్నా వీరు సర్టిఫికేటు యివ్వరు. ఇచ్చినా పని చేయటం సరిగా చేతగానందున తొలగించినట్లు అందులో ఉద హరిస్తారు. ఆ సర్టిఫికేటువల్ల లాభం ఉండదు. ఇచ్చేపనికూడా ఉపసంహరించుకుంటారు' అని మదన్ పడుకుని పరిపరివిధాల ఆలోచించసాగాడు. ఇంతలో ఆకస్మికముగా దొడ్లో ఎవరో అంట్లు తోముచున్న చప్పుడు వినిపించింది. వెళ్ళి చూడగా చంపావతి స్వయంగా పాత్రలను ముందువేసికొని తోముతూ కూర్చుని ఉండటం కనుపించింది. సుఖియాకు జ్వరంరావటం వల్ల ఆరోజు పనికిరాలేదు. ఆ పుష్యమాసపు రాత్రి చలిలో ఒంటిగా కూర్చున్న చంపావతిని చూచేప్పటికి ముందుగా రానున్న కష్టాలకు యిది ప్రారంభంగా కనుపించిం దతడికి. ఒక ప్పుడు ఈయింటియందే ఇద్దరుదాసీలు పనిచేయుచుండెడివారు. అట్టిదియిప్పుడు ఇల్లాలే శ్రమపడవలసివచ్చింది. ఇకముందు యింకా ఎన్నికష్టాలు ఇటువంటివి పడవలసి ఉందో ఎవరుచెప్ప గలరు. వెంటనే అతనిమనస్సునకు ఇంకొక చెడ్డదృశ్యము కను పించినది. తాను, ముందు ఎవరో కర్రపుచ్చుకుని దారిచూపు వారివెంట నడుచుచున్నట్లును, తన భార్యా బిడ్డలు వెంటరా వీధులవెంట తాను భిక్షాటనము చేయుచున్నట్లునూ అదీ తన ఆఫీసు హెడ్‌గుమాస్తా కాశీబాబుగారి యింటిముందేనని, వారు గుమ్మంలో ఉన్నట్లు ఆలోచన కలిగేటప్పటికి అతనికి అమిత మైన దుఃఖం కలిగింది. ఇంతలో చంపావతి యిల్లు అంతా సర్దుకుని అక్కడకు రావటంలో అతని ఈ ఆలోచనలకు భంగం కలిగింది. ఆమె అతని మంచంపై తలవైపున కూర్చుని తన

చేతితో అతని తల నిమురుతూ, ఇంకా యివాళ నిద్దురపట్ట లేదా ? అని మృదువుగా అడిగింది.

'లేదు. యిందాక నీకు చెప్తానన్నది అంతా చెప్తాను కూర్చో. నే చెప్పిందంతావిని, నేను యేమార్గాన్ని అనుసరించాలో ఆలోచన చెప్పు అని, ఈమధ్య జరుగుచున్న వ్యవహారములన్నియు విపులంగాచెప్పి రేపు నేను యేమని జవాబుయిస్తే బాగుంటుందో నీ అభిప్రాయం చెప్పు' అని అడిగాడు ఆమె ముఖంమీదనే తన దృష్టిఉంచి.

చంపావతి తన వ్రేళను భర్త జుట్టులోనికి పోనిచ్చి మెల్లిగా నిమురుతూ 'నేను మీ అర్ధాంగిని, జీవించి నంత వరకు ధర్మమార్గమును వీడరాదనే నేను సలహా యివ్వగలను. మనకు ఏ అధర్మ కార్యాచరణయూ వలదు. మీరు ఇది వరకు అధర్మ కార్యాచరణులయి ఎంతో కష్టము మీదగాని నుంచిదారికి రాలేకపోయితిరి. మరల ఆదారివైపు చూచుట తటస్థించిననూ, పతితులై పోవుదురు. తిరిగి మీరు బాగుపడట మంటూ యుండదు. 'నాకు మట్టుకు తెలియదా! బాగుగా ఎరుగుదును. నా మనస్సు ఎంత దుర్బలమైనదో కూడ నాకు తెలుసును. నేను ఒంటరినై యుండి - వివాహము చేసికొన కుండా యుండినచో - విచారించి యుండెడి వాడను కాను. ఉద్యోగము పోతేపోయినది. ఏదో విధముగా కష్టపడి పొట్ట పోసుకొందును. అంతేగాని నీవు చెప్పినట్లు—'

'మీరు మా కొరకు విచారపడకండి. భగవంతుడే మనకు దిక్కు. అతడే మన మొరఆలకించును. మీరు ధర్మ మార్గమును వీడకుండినచో ఆ పరమాత్ముడే మనకు దారి చూపెడతాడు.'

'అయితే నా నిర్ణయమువల్ల నీకే విచారములేదా?'

'యదార్థముగ నాకే విచారములేదు. నారు పోసిన వాడు నీరు పోయడా! మనలను సృష్టించిన ఆ పరమాత్ముడు ఎన్నడూ మనల్ని ఆకలితో చంపడు.'

'నీకు నమ్మకమేనా?'

'ఆ. నమ్మకమే.'

'అయితే ఉద్యోగము పోయిననూ వప్పుకుందును గాని మద్యమును త్రాగుటకు ఒప్పుకోనని కాళీ చరణ బాబుతో చెప్పివేస్తాను."

"చెప్పండి!"

మదనుడు మళ్లీ కొంతసేపు ఆలోచింపసాగాడు. ఈ తడవ తనకులోగడ జగన్‌మోహన్‌బాబు చెప్పిన 'ధైర్యమును మును వీడక భగవంతుని ముఖముచూచి ఏకార్యమైననూ చేయుము. తప్పక జయము లభించును." అన్న మాటలు జ్ఞప్తికివచ్చాయి. అప్పుడు "సరే! అలాగే చెప్తాను. ఉద్యోగము పోయిననూసరే భగవతుని చరణముల నాశ్రయింతును గాని, వ్రతభంగము గానీయను." అని చెప్పుచూ చంపావతిని దగ్గరకు తీసుకుని మృదువుగా ఆమెచెక్కిళ్ళను స్పృశించాడు.

## 11

ఈరోజు ఆదివారం. ఒక సంవత్సరంవరకు మదన్ ఆ యింట్లో ఉండేందుకు పొడుగించిన గడువు ఈ రోజుతో పూర్తి అయిపోయింది. ఈ ఉదయంనుంచి మదన్ ముఖం మరీ విచారగ్రస్తమై యుంది. చంపావతిగూడ ఆ

స్థితిలోనే యుండెనుగాని భర్త అధైర్యపడతాడని ఆమె లోలోపల్నే దుఃఖిస్తూ భర్తకు ధైర్యము చెపుతోంది.

పదిగంటలుకాగానే మదన్ స్నానచేసి పిల్లల నిద్దరినీ ప్రక్కన కూర్చుండబెట్టుకుని భోజనము చేయుచుండెను. వారి భోజనముకూడ అతి సామాన్య గృహస్థునియింట గలుగు పదార్థములతోనే జేయబడినదైననూ, ఆ పిల్లలిద్దరూ అతి ఉత్సాహముతో భోజనము చేయుచుండుటను చూసి మదన్ తనమనస్సులో 'ఇక నాల్గుదినములు గడిచిన, ఈ పిల్లలిద్దరూ యింత ఆనందముగా యుండుట తాను చూడగలనో లేదో యని విచారించుచుండెను. అతనికి అన్నముకూడ సహించ లేదు. అర్థాకలితోనే లేచిపోయెను. భోజనానంతరము కొంచెము విశ్రమించదలచి మంచముపై జేరెను. గాని నిద్ర రాలేదు. 'చంప' కూడా భుజించి భర్తను చేరవచ్చింది. ఎంతకునూ నిద్రరానందున మంచంపైలేచి కూర్చుండి భార్యను హుక్కా తెమ్మని రెండుగ్రుక్కలు పీల్చి, భార్యతో "చంపా! నిన్నటితో మన యింటిగడువు పూర్తిఅయింది. యింకా నోటీసురాలేదు. ఇవాళో రేపో అదికూడా...అదికూడా రావచ్చు. అని తడబడుతూ అన్నాడు.

"బహుశా మోహన్‌లాల్‌గారికి మీ ఉద్యోగము పోయినసంగతి తెలియవచ్చినదేమో! అందుకని ఆయన కొంత సంశయించి ఊరుకొని ఉండవచ్చు. ఆయనకుమాత్రము ఆమాత్రము జాలిగుండె యుండదా ?"

"దయాలేదూ! గియాలేదూ. ఏదో పనితొందరలో ఉండి ఉంటాడు. ఇవాళో, రేపో తప్పక నోటీసు వస్తుంది. చూస్తూ ఉండు!"

మూడు గంటలవేళ కొడుకువచ్చి "నాన్నగారూ చెప్పులు తెగిపోయినవి, ఆదివారంనాడు కుట్టిస్తానన్నారు. యివాళే ఆదివారం; కుట్టించరూ?"

"యివాళకాదు నాన్నా! వచ్చే ఆదివారం."

"ఎప్పుడు అడుగుతే అప్పుడే యిలా అంటున్నారు." అని కుర్రాడు మారాం చేయసాగాడు. ఇంతలో కూతురు వచ్చి "అమ్మా! ఏమన్నా డబ్బులు యివ్వ' మిఠాయి కొనుక్కు తింటాను. నాకు ఆకలౌతోంది." అన్నది. తల్లి అందుకుని "యివాళ మిఠాయివద్దు- సాయంత్రం రొట్టెలు కాల్చిపెడ తాను." బాలిక డబ్బులకోసం ఎన్నోవిధాల ప్రాధేయపడింది గాని లాభంలేకపోయింది. ఈ రోజుల్లో ఆ దంపతులు కానీని ఒక్క రూపాయిగా చూచుకుంటున్నారు.

'అమ్మగారూ చాలాపొద్దుపోయింది. ఇంట్లో బంగాళ దుంపలు లేవు బజారు వెళ్ళిరానా?" అని సుఖదా అడిగింది.

"వద్దులే. వంకాయలున్నాయి. ఈ పూటకు కూర వండుకోవచ్చు."

అదే సమయంలో క్రిందనుంచి "బాబుగారూ!" అని పిలిచిన కేక వినిపించింది. ఎవరు పిలుస్తున్నారో చూట్టానికని భార్యాభర్తలిద్దరూ ఒకేసారి కిటికీవద్దకు వెళ్ళి చూచారు. ఎవరి నౌకరో క్రిందనుంచుని కేక పెడుతున్నాడు. చంప భయంతో "ఎవరు?" అని భర్తవేపు చూచింది.

"మరెవరూ కాదు. అతడు మోహన్ నౌకరు. బహుశా నోటీసు తీసుకువచ్చి ఉంటాడు." అని మదన్ ఓపిక చేసుకుని క్రిందకు వెళ్ళి ఆ నౌకరు తెచ్చిన ఉత్తరమును ముట్టినట్లుగా వాడి పుస్తకంలో సంతకంచేసి బరువైన హృదయంతో మెల్లిగా పైకివచ్చాడు. అతని ముఖము కళ తప్పిఉంది. ఉత్తరము పట్టుకున్న చేయి వణకసాగింది. తిన్నగా గదిలో మంచమువద్దకు వెళ్ళి స్థిమితముగా కూర్చుని "చంపా! ఆయనకు ఈమాత్రమైనా జాలికలగదా?" అన్నావు. ఇప్పుడు చూస్తున్నావుగా ఆయన దయ, అంటూ కవరు చించి భయపడుతూ భయపడుతూ లోపలి ఉత్తరమును బయటకుతీశాడు.

ఉత్తరము తీస్తూ 'ఇదేమిటి. ఉత్తరముకు ఒక చెక్కు (Cheque) గ్రుచ్చి ఉన్నదే! చెక్కు కూడా నా పేరనే వ్రాయబడి ఉంది. పన్నెండు వేల మూడువందల యాభైరూపాయిలకు! ఇదేమిటి, మోహానుని సంతకముకూడ యున్నదే. మోహానుడు నాపేర యింత మొత్తమునకు చెక్కు పంపటమా?' అని ఆశ్చర్యపోయాడు. మొదట అతనికి నమ్మకము కలగలేదు. తలతిరిగి మతి తప్పసాగింది. నెమ్మదిగా కనులు తెరిచి చంపా! కొంచెం తలమీద నీళ్లు చల్లు, ఏదో మైకం కమ్ముతోంది.' అని మెల్లగా అన్నాడు.

చంపావతి గాబరా పడుతూ చెంబుతో నీళ్ళు తెచ్చి అతని తలమీద చల్లసాగింది. అతడు కొంతసేపటికి తెప్పరిల్లి 'చంపా! విచారించకు. ఇది మనకు శుభవార్త. ఇప్పటికి భగవంతునకు మనపై దయగలగింది. ఉత్తరం చదువుతాను విను!'

## 12

భవానీపూర్

బాల్య బంధూ !

బాల్యము నుండియూ మనము అన్యోన్య మైత్రితో మెలగితిమి. మన ఆ చిన్నతనపు జీవితమెంతో మధురమైనది. పవిత్రమైనదిన్నీ. ఎల్లకాలమూ ఆ విధముగా ఉన్నట్లయితే యెంతో బాగుండేది కదూ?

బాల్యములో మనలో ఏ ఒక్కరూ, రెండవ వానిని తక్కువగా ప్రేమించు చున్నట్లు సందేహము కలిగినప్పుడు మనకు ఎంత విచారముగను, కష్టముగను ఉండెడిదో జ్ఞాపకమున్నదా?

నేడుకూడ నీపై నాకు ఆ భావమే యున్నది. కానీ, గత ఆరు సంవత్సరముల నుండి నన్ను ఆ ప్రేమ భావము విడచిన హృదయవిహీనుడగు ధనపిశాచముగ తలంచు చున్నావు. నన్ను నీవు ఈ విధముగా తూలనాడు చున్నావని విని ఎంతగానో విచారపడితిని. ఈశ్వరానుగ్రహమునలన ఈనాడు మరల మనమూ పూర్వమైత్రితో మెలంగ గల రోజులు వచ్చినవి. మీ తండ్రిగారి మరణానంతరం నీవు దుస్సాహసములుచేసి పెడమార్గముల నడువసాగితివి. ఇది చూచి నేను నీకు అది కూడదని ఎన్నో సార్లు చెప్పి చూచితిని. కాని నా మాటలను నీవు యే మాత్రమూ లక్ష్యపెట్టవైతివి. తత్ ఫలితంగా అప్పులపాలైతివి. ఆరోజు అప్పుతీర్చుటకై ఋణము నిమిత్తము నావద్దకు వచ్చినపుడు ఆ నీ ఆస్తిని యితరులెవరికీ తాకట్టుపెట్టకుండా ఉండటానికై నేనే తాకట్టు పెట్టించు

కున్నాను. అయిదు సంవత్సరములలోనూ నీ ప్రవర్తనలో మార్పు వస్తుందేమోనని, ఎప్పటికప్పుడు రహస్యంగా కని పెట్టుచునే యున్నాను. కానీ, నీలో యేమార్పు కనుపించ లేదు. ఏవిధంగా నిన్ను దారికి తేవలయునాయని చాలా ఆలోచించినాను. చివరకు ఒక ఉపాయము తోచినది. నీవు పతితుడవైనప్పటికీ నీ హృదయమున భార్యాబిడ్డలపై నీకు గల మమకారము గుర్తునకు వచ్చినది. నీ భార్యాబిడ్డలు కష్టములకుపాలై తిండి లేక యిబ్బందిపడుట చూచి నీవు సహింపలేవన్న సంగతి గుర్తించితిని. వెంటనే నీ ఆస్తి నంతయూ నాచే చిక్కించుకుని నిన్ను దరిద్రునిచేయ నిశ్చ యించి ఆ విధముగా చేసితిని.

పోలీసుకోర్టులో నీపై తేబడిన కేసు వార్తాపత్రికలో చదివి, జగన్‌మోహన్ సింగును నీవద్దకు పంపితిని. ఆతడు నాకు ఆప్తమిత్రుడు. కంపెనీ హెడ్‌గుమాస్తా కాశీబాబుతో చెప్పించి నేనే నీకు ఉద్యోగము వేయించితిని. ట్యూషను మిషతో చదువు చెప్పుటకు ఏర్పాటుచేయించి తరువాత రోజుకు ఒక్క రూపాయిచొప్పున యిచ్చే ఏర్పాటు చేయిం చిందికూడా నేనే. ట్యూషన్ నెపముతో రాత్రి తొమ్మిది గంటలవరకూ వారి యింటనే ఉండునట్లుకూడా ఏర్పాటు చేయించితిని. ఎందుకనగా ఆ సమయమునకు నీవు యింటికిపోవు దారిలో సారాదుకాణములన్నియూ మూసివేయబడునుగదా. నీకు దానిపై భ్రమ కలిగిననూ అది దొరకకుండ యుండుటకు గాను అంత రాత్రివేళవరకూ నిన్ను ఆపిఉంచునట్లు చూడ మన్నాను. ప్రతిదినమున్నూ నీ ప్రవర్తనను రహస్యముగా తెలుసుకొనుచునేయున్నాను. పదినెలలనుండి నీవు మద్య

మును ముట్టుకొనలేదన్న సంగతి గ్రహించి, నీవు సన్మార్గము నకు వచ్చితివని సంతోషించాను. అయిననూ, నా మనస్సు నిన్ను యింకనూ పరీక్షించవలసినదని బోధించినందున మా కంపెనీ హెడ్‌గుమాస్తాగారిచే హెచ్చరించునట్లుచేయించితిని.

ఒకవైపు భయంకరమైన దారిద్ర్యము జీవనాధారమగు ఉద్యోగము రెండవవైపు సన్మార్గమునబోవుట- తత్ మూలముగ ప్రతిజ్ఞను వీడకుండుట. ఈ రెండుసమస్యలనూ కల్పించి కూడచూచితిని అయినప్పటికి నీవు నీమాట నిలబెట్టుకొంటివి. ఇక భయములేదని తృప్తిబొంది మహదానందపడితిని.

నీ చేతులమీదుగా పోగొట్టుకున్న ఆస్తి పోయినది. కాని, నాచే కాపాడబడిన నీ ఆస్థిని నీకు యిచ్చివేయుచున్నాను. నీకు డబ్బు అప్పిచ్చినపుడు నేను నీచేత సంవత్సరంకు నూటికి పన్నెండురూపాయిల వడ్డీ యిచ్చేటట్లు నోటు వ్రాయించుకున్నాను. నీరెండిండ్లనూ భుక్తపర్చుకున్న వారం రోజులలోనే వాటిని హెచ్చుధరకు అమ్మే అవకాశంవచ్చింది. అవి అమ్మి ఆ సొమ్ములో నేనిచ్చిన సొమ్ము బ్యాంకి వడ్డీతో లెక్కచూచి నా కివ్వతేలిన మొత్తమును యిల్లు అమ్మగా వచ్చిన సొమ్ములో మినహాయించుకుని మిగిలిన సొమ్ము బ్యాంకులో జమగట్టితిని. పోగా నీవు నివసించుచున్న యిల్లు నీకు మిగిలినది. దానిని నీకు తిరిగి యిచ్చివేయుచూ దస్తావేజు వ్రాసితిని అది యిందులో జతపర్చుచున్నాను. దీనిని నీవు రిజష్టరు చేయించుకొనుము.

అసలు వడ్డీలేకుండ నీకిచ్చిన పాతిక వేలరూపాయిలను మాత్రమే తీసుకోవలెననుకొంటిని. అటుల చేసినయెడల నీకు నే నేదో ఆర్థికసహాయము చేయుచున్నాననియు, దానికి నీవు

నాకు లోబడియుండవలసి వస్తుందనియూ తలంతువని
బ్యాంకి వడ్డీనైననూ పుచ్చుకునుచున్నాను. నీకు ఈ ఉత్త
ములో పంపిన చెక్కులోని మొత్తమంతయూ, యదార్థము
నీకు చెందునదే. ఒక్క దమ్మిడీకూడ నీదికానిది పంపలేద
ఇకమీాద నీవు డబ్బుకు యిబ్బందిపడనవసరము లేదు.

నీకు ఆ ఆఫీసులో ఉద్యోగమే చేయవలెనని ఉన్న
కాళీబాబుతో నేను చెప్పిపైఉద్యోగము వేయింతును. వా
చెప్పినచో ప్రొప్రయిటరుగారు ఖాయమైన మంచి ఉద్యో
గమే యివ్వగలరు. కానిచో ఈ పన్నెండు వేలరూపాయల
ఏదైనవ్యాపారము చేసికొనుము. మీా తండ్రి తాతలనుండి చే
చున్న వ్యాపారమునే నువ్వుకూడ చేయుము. ఒకప్పు
నీవు చేసిన వ్యాపారమే అది. దానియందు నీకు బాగా అ
భవమున్నదే. ఆ వృత్తిని విడచుట నా అభిప్రాయము
మంచిదిగాదు. పైగా నీకు అదిక్రొత్తది గాదు కూడాను.

నేను స్వయముగా వచ్చి ఈ విషయములన్నియ
చెప్పి ఈడబ్బు నీకిచ్చుట కంటె, యిటులనే చేయుట మ
దని తలచితిని. నిన్ను ముఖా ముఖిని చూచి చాలా
లైనది. కూడాను. ఒకసారి సాయంత్రము, నీ భార్య
పిల్లలను వెంటబెట్టుకుని రాగోరెదను. రాత్రికి యిక్క
ఉండిపోవచ్చును.

నీ బాల్యమిత్రుడు,

మోహన్‌లాల్ శర్మ.

ఉత్తరం యావత్తూ చంపకు వినిపించి 'పద
కాళీఘాట్‌కు వెళ్లి కాళీ దర్శనం చేసుకుని కాళీ

చేయించి వచ్చేటప్పుడు మోహన్ యింటికి వెడదాం.' అన్నాడు మదన్.

'నేను చెప్పలేదు! మీరాయన్ని ఉట్టినే శంకిస్తున్నారని.

'అవును చంపా! అప్పుడు నేను యే పరిస్థితిలో అన్నానో నీకేం తెలుసు. తిండీ తిప్పల్లేకుండా మీరేమై పోతారోనని దిగులు పడేవాడిని. ఆ ఆలోచనతో నాకట్లా అనిపించేది. పద, కాళీ పూజచేసుకుని తరువాత అతనింటికి వెళ్లి అతణ్ణి క్షమాభిక్ష వేడుకుంటాను!' అన్నాడు మదన్.

ఇంటికి తాళంపెట్టి కుటుంబ సహితంగా వెళ్లి శ్రీ కాళీ మాత పూజచేసుకుని తిరిగి వచ్చేటప్పుడు మోహన్‌లాల్ ఇంటికి వెళ్లారు.

అంతదూరాన్నే మదన్ రావటం చూచి మోహన్ లాల్ ఎదురొచ్చి కావిలించుకుని యింట్లోకి తీసుకుపోయాడు. అక్కడ, మదన్ వంగి మోహన్ పాదాలకు నమస్కరిస్తూ 'అన్నాయ్! నా తప్పులన్నీ మన్నించవూ?' అన్నాడు.

మోహన్‌కు మాటరాలేదు కాని కళ్ల వెంట అమితంగా నీరుకారింది. మూగవాడివలె మిత్రుణ్ణి కావలించుకుని సోఫాలో కూలబడిపోయాడు. మోహానుని భార్య బలవంతంమీద వారా పూట మర్రోజు అచ్చట ఉండిపోయారు. ఇప్పటికీ మిత్రత్వాన్ని గురించి చెప్పుకోవాలంటే వారి మైత్రినే ఆదర్శంగా తీసుకుంటూ ఉంటారు.

---

# దు లా రి

డాక్టర్ ధార్ వకీల్ కిశోరీలాల్ తాంబూలాచరణం చేసుకొంటూ చేతికఱ్ఱ హుషార్‌గా త్రిప్పుకుంటూ జయరాం ప్లీడరుగారి యింటిముందుకువచ్చి 'జయరాంజీ జయరాంజీ' అని కేకవేస్తూనే వరండాలోకి వచ్చారు. ప్లీడరుగారు వరండాలో బెంచిమీద కూర్చుని హుక్కా పీలుస్తున్నారు. వచ్చినవారికి ఆసనాలు చూపిస్తూ 'ఏమిటి విశేషాలు, యిద్దరూ యివాళ ఉదయమే యిట్లా బయలుదేరారు.'

'మరేంలేదు. పురవా జమీందారుగారు మమ్మల్ని పెండ్లికి ఆహ్వానించారు. సోమవారంనాడు జంగీసింహుడి కూతురు పెళ్లి చేస్తారట చాలా బాగా వైభవంతో! లక్నో, కాశీ, పాట్నా, యింకా యితర పట్నాల్నుంచి భోగం మేళాలుకూడా వస్తాయట. మరి మీకూడా ఆహ్వానం వచ్చిందా ?'

జయరాంగారి స్వభావం వీరికి బాగా తెలుసు. అతి సామాన్య విషయాన్నికూడా ఆయన తప్పుపట్టుకుంటాడని. ఆయన హృదయం అతి కోమలమైనది. వెన్నలాంటిది. అది బంధుప్రేమ, స్నేహవాత్సల్యాలతో నిండి సద్గుణ సంపన్న శోభితమై ఉంటుంది. వారితో ఏకొద్ది పరిచయమున్నా వెంటనే ఈ సంగతి తెలుసుకోగలుగుతారు.

వచ్చినవారు వేసిన ఈ ప్రశ్న విని, త్రాగుతూన్న హుక్కాగొట్టాన్ని ప్రక్కనబెట్టి కొంచెం ఆవేశంతోనే

'ఏమిటీ ఆహ్వానం నాకు రాకుండానే మీకు వచ్చిందంటారా? ఇరవైయేళ్లనుంచి నేను వాళ్ళ ఎస్టేటు ప్లీడరును. అలాంటప్పుడు నన్ను పిలవందే మిమ్మల్ని పిలుస్తారా యేమిటి? ఈ సంగతి మీకు ఎలాతోచలేదా? అంటాను.'

'అబ్బే మా అభిప్రాయం అదికాదు. జయరాంబాబూ, మన జిల్లాలో మీవల్ల ఉపకారం పొందనివారెవరు? మీరు ఆరోజుకు పురవా వెళతారా వెళ్ళరా అని అడుగుతున్నాను.' అన్నాడు కిశోరీలాల్.

జయరాంబాబు ఈమాట చెవినిబడగానే మెత్తబడి పోయాడు. వచ్చినవాళ్ళను 'కూర్చోండి, కూర్చోండి' అంటూ వాళ్లను మర్యాదచేశాడు. వాళ్ళు కూర్చున్నాక.

'పురవా వెళ్లేందుకు ఒక చిన్న చిక్కువచ్చిపడింది. సోమ మంగళవారాలు రెండురోజులూ కోర్టుకు నాగా అవుతుంది. వెళ్ళకపోతే జమీందారుగార్కి కష్టంతోస్తుంది. ఏంచేద్దామా? అని ఆలోచిస్తున్నాను. మరి మీ సంగతి... వెడతారా?'

డాక్టర్ ధార్ అందుకుని 'వెళ్లాలనేఉంది. అంత దూరం వెళ్లటం సామాన్యమా? ఎడ్ల బండిమీద వెళ్లటానికి రెండు రోజులు, రావటానికి రెండు రోజులు పడుతుంది. సవారీమీద వెళ్ళితే తొందరగానే వెళ్లొచ్చుకాని అది దొరికే మార్గంలేదు. అందుకని మిమ్మల్ని ఈసంగతి సలహా అడుగుదామని వచ్చాం. మీరు వెళ్లేటట్లయితే రాజాగారి దగ్గర్నుంచి, ఏనుగన్నా-ఇంకేమన్నా తెప్పిస్తారని, దాని మీదే మనంకూడా సుఖంగా వెళ్లచ్చని, వచ్చాం!'

'జయరాంబాబు మందహాసం చేస్తూ అదా సంగతి! దీనికింత ఆలోచనెందుకు? కుందనపురంరాజాగారికి రేప్రొద్దున ఉత్తరంవ్రాసి పంపుతా సాయంత్రానికి ఏనుగు వచ్చేస్తుంది.'

'చూచారా డాక్టర్‌బాబు. దీని కింత ఆలోచనెందుకండీ. వారు ఏదో ఆలోచించి చెబుతారని నేనిందాకనే చెప్పానుకాదు. ఏం జయరాంబాబు మమ్మల్నికూడా తీసుకెళతారు గాదూ?'

'అలాగే తప్పకుండాను! సరే వెళ్లిరండి.'

## 2

ఆ మర్నాడు ఆదివారం ప్లీడరుగారు ఉదయం పెందలాడేలేచి, స్నానం సంధ్యా, జపం తపం అల్పాహారాలతో సహా పూర్తి జేసుకుని వచ్చి ఆఫీసు గదిలో కూర్చున్నారు. అప్పటికే చాలమంది పార్టీలు వచ్చి వీరికోసం కూర్చుని ఎదురు చూస్తున్నారు. కొంత ప్రొద్దెక్కే వరకు వారికి సలహాలివ్వడంతోటే సరిపోయింది. ఇంతలో ఏనుగు సంగతి జ్ఞాపకంవచ్చింది. వెంటనే కాగితం కలం తీసుకుని కళ్లకు జోడుపెట్టి 'ప్రబల ప్రతాప శ్రీ శ్రీ, శ్రీమన్మహా రాజా కోసలేశ్వరసింహ బహద్దూర్ మహారాజావారి సన్నిధికి, తమరు ఆశ్రితజన ప్రతిపాలకులు.' అని ఉపచార వాక్యాలు కుశల ప్రశ్నలూ అయినతరువాత ఒక మంచి ఏనుగును దయచేసి పంపించ వలసింది. అని ప్రార్థనా పూర్వకంగా ఉత్తరం పూర్తి జేసారు. ఇదివరకూ అనేక

పర్యాయాలు ఇలా వ్రాయటం వారు పంపటంకూడా జరిగింది. నౌకర్ని పిలిచి వెంటనే వెళ్లి 'ఈ వుత్తరం యిచ్చిరా.' అని పంపించారు.

ప్లీడరుగారి వయస్సు యాభై సంవత్సరాలకు పైబడింది. చామనచాయ, పొడుగ్గా వుంటారు. సగం నెరసీ నెరవని గడ్డం, ఆయనకళ్లు పెద్ద పెద్దవి. ఆయన హృదయం ఎంతో కోమలమయిందని ఆ కళ్లే చెపుతూ ఉంటాయి. వీరు మొట్టమొదట లక్నోలో ఉండేవారు. ఇక్కడ వీరు మొట్టమొదటిసారిగా వచ్చిన రోజుల్లో ఈ వూరికి రైలులేదు. కొంతదూరం ఒంటె మీద కొంతదూరం కాలినడకను ఎడ్లబండిమీద రావలసి వచ్చేది. వీరు ఇక్కడికి కట్టుబట్టలతో మాత్రం వచ్చారు. ఇక్కడ వీరికేం ఆస్థిపాస్తులు లేవు. నెలకు రెండు రూపాయి లకు ఒక యిల్లు అద్దెకు తీసుకుని వంటచేసుకుతింటూ ప్లీడరీ ప్రారంభించారు. అంత బీదస్థితిలో వచ్చిన జయరాంబాబు గారు ఇప్పుడు ఒక డాబాయిల్లు కట్టించి చుట్టూ తోట దాని చుట్టూ ప్రహారీ ఏర్పాటుచేశారు. గ్రామస్థుల యిబ్బంది చూచి ఆవూరి కొక చెరువు ఓ శివాలయంకూడా వేరే ఏర్పాటు చేయించారు. డబ్బుకూడా బాగానే నిలవచేశారు. ఎంతోమంది ఇంగ్లీషు చదువుకున్న ప్లీడర్లున్నప్పటికీ జిల్లా మొత్తంమీద వీరికున్న పేరుప్రతిష్టలు ఎవ్వరికీ లేవు.

ప్లీడరుగారు ఎంత కోమలమైన మనస్సు గలిగినవా రైనా, ఎంత ప్రేమభావం కలిగిఉన్నా కొంచెం పెడసరితనం లేకపోలేదు. పడుచుతనంలో ఒకటోరకపు పేచికోరుగా ఉండే వారటగాని యిప్పుడదంతా తగ్గిపోయింది. ఆ రోజుల్లో అఫీస

రైనా, ఏ పొరపాటుగాని. చేసినట్లయితే వారిమీద విరు చుకుపడేవాడుట. ఓధఫా ఓ డిప్యూటీకలెక్టరుకూ ఈయనకు ఘర్షణ జరిగింది. ఇంటికి వచ్చేప్పటికి ఆవుకు కోడెదూడ పుట్టిందని విన్నాడు. ఆ దూడకు కోపంతో కలెక్టరుగారు పేరుపెట్టాడు. కలెక్టరుగారికి ఎలాగో యీ సంగతి తెలిసి బాధపడ్డారు.

ఇంకోసారి యింకో కలెక్టరుగారితో ఏదో లాకు సంబంధించిన విషయంలో వాదించుకున్నారు. ఎంత చెప్పినప్ప టికీ వీరివాదనను ఆయనఒప్పుకోలేదు. దానిమీద ప్లీడరుగారికి చాల కోపం వచ్చింది. వెనకాముందూ ఆలోచించకుండానే కలెక్టర్ను పట్టుకుని 'నాభార్యకు తెలిసినంతమాత్రం లాకూడా మీకు తెలియదు' అన్నాడు. దానిమీద కోర్టువారిని అవ మానం చేసారనే నేరంక్రింద జయరాంబాబుకు ఐదురూపా యిలు జరిమానావేశారు. అది పట్టుకుని హైకోర్టుదాకా చూచి పదిహేనువందలరూపాయిల ఖర్చుతో రద్దుచేయించు కున్నాడు.

జయరాంబాబు ఎంత విరివిగా డబ్బు సంపాయిస్తూ ఉండేవారో అంత విపులంగా ఖర్చుకూడా పెడుతూండేవారు కూడాను. అనేకమంది. ఆర్తులకు అన్నదానం చేస్తుండే వాడు. అనేక బీదవాళ్ళకు ఫీజులేకుండా వ్యాజ్యాలు గెలి పించారు. ఒక్కొక్కప్పుడు బీదలకు న్యాయం కలుగజేయా లని తన స్వంతడబ్బు ఖర్చుపెట్టికూడా వ్యాజ్యాలు వేయించే వాడు.

ప్రతి ఆదివారం ఊళ్లో యువకులు వృద్ధులు ప్లీడరుగారి యింటికివచ్చి ఏ పేకాటో చదరంగమో ఆడుకుంటూ కాల

క్షేపం చేసేవారు. ఆదేవిధంగా ఈరోజుకూడా చాలామంది వారింటికి వచ్చారు. డాక్టర్ ధార్ వకీల్ కిశోరీలాల్‌గార్లు కూడా ఉన్నారు. అనుకున్న ప్రకారం ఏనుగ రావలసింది ఈరోజే. దాన్ని కట్టివేసేందుకు జయరాంబాబు తోటలో ఒక చోటు బాగుచేయించను గూడా బాగుచేయించారు. రాత్రి ఏనుగు తినేందుకు అరటిమొక్కలు, తాటాకులు, యింకా కొన్ని చెట్ల రెమ్మలు కొట్టించి తెచ్చిపడేయించారు. ఇంకా దాన్ని కట్టివేసేచోట కావలసిన ఏర్పాట్లన్నీ చేసేందుకు పని వాళ్లతో చెప్పి వాళ్ళు పని సరిగా చేస్తున్నారో లేదోనని మాటిమాటికి పోయి చూస్తూఉండేవారు. ఈలోగా ఒకటి రెండుసార్లు హుక్కా పీల్చడంమట్టుకు మరచిపోలేదు. తరువాత చదరంగం ఆడదామని బల్లముందుకూర్చుని రెండు ఎత్తులు వేశాడోలేదో యింతలోనే తను పంపించిన నౌకరు వచ్చి 'ఏనుగను పంపించలేదు!' అన్నాడు.

జయరాంబాబు నిరాశా భావంతో 'ఆఁ! పంపించ లేదూ?' అన్నాడు.

డాక్టర్:- 'అంతా చెడిపోయింది.'

'ఎందుకు పంపించలేదు? ఉత్తరానికి జవాబేమన్నా ఇచ్చారా?' అన్నాడు జయరాంబాబు నౌకరుతో.

'లేదు. ఉత్తరం దివాన్‌గారికి యిచ్చాను. వారు రాజాగారి దగ్గరకు ఆ ఉత్తరం తీసుకువెళ్ళి కొంచెంసేపట్లో తిరిగివచ్చి, 'పెళ్ళికి పిలిచినంత మాత్రంలో ఏనుగును పంపించాలా ఏం? ఎడ్లబండీ చేసుకు రమ్మన్నారని చెప్పు! అని చెప్పాడు.'

ఈ మాటలు వినేప్పటికి అభిమానం, సిగ్గు, కోపంవల్ల ప్లీడర్ జయరాంబాబుకు పిచ్చెత్తి నట్లయింది. కాళ్ళు చేతులు వణక సాగాయి. కళ్ళు జ్యోతిలాగయిపోయాయి. ముఖం ఎర్రబడింది. వణుకుతున్న గొంతుకతో 'ఏనుగును పంప లేదూ! ఏనుగునుపంపలేదూ' అంటూ ఆవేదనతో వాపోయాడు. అక్కడ ఉన్న వాళ్ళంతా ఆటలు కట్టివేసి ఈయనవంకే చూస్తూ ఉండిపోయారు. ఇంతలో ఒకరు అందుకుని 'దానికి మీరేం చేస్తారు జయరాంబాబు! పరాయివాళ్ళ వస్తువాయిరి మనమేం చేస్తాంబాబూ! యేదైనా మంచి ఎడ్లబండీ చూచి బాడుక్కు తెప్పించండి. ఇక్కడ రాత్రి పది పదకొండు గంటలకు బయలుదేరితే సరిగా ముహూర్తానికి జేరుకుంటారు. ఇమామ్ ముద్దీన్ ఈమధ్య కొనుక్కొచ్చిన గిత్తలు బాగా చలాకీగా పోతాయ్.' అని నచ్చ చెప్పాడు.

జయరాంబాబు ఆ చెప్పేవారి వైపన్నా చూడకుండా 'కాదు! ఎడ్లబండిమీద పోనే పోను. వెళ్ళితే ఏనుగమీదే వెళ్లాలి లేకపోతే మానెయ్య నన్నా మానేస్తాను.' అని శపథం చేసినట్లు అన్నారు.

## 3

రాయిబెర్లికి మూడు నాలుగు మైళ్ళు దూరంలో ఉన్న యిద్దరు ముగ్గురు జమీందార్ల దగ్గర ఏనుగు లున్నాయన్న సంగతి జయరాంబాబుకు తెలుసు. ఆరాత్రే తన నౌకర్లను అక్కడకి పంపించాడు ఎవరైనా అమ్మే

తారేమో కనుక్కురమ్మని. అర్ధరాత్రి కాకముందే ఒకడు తిరిగివచ్చి ఒకరి దగ్గర అమ్మేందుకు సిద్ధముగా వుందని ఏనుగ చిన్న వయస్సుదనిన్నీ కాని ధర ఎక్కువ చెప్పుతున్నారనిన్నీ చెప్పాడు.

'ఎంతకు యిస్తా నన్నారు?'

'రెండు వేలుట!'

'చిన్న పిల్లా'

'మరీ చిన్నదికాదు. సవారీకి పనికి వస్తుంది.'

'అయితే సరే! కొందాం. నువ్వువెళ్లి రేపు ఉదయానికి తోలించుకురా. ఆ యేనుగుతో బాటు ఎవరైనా వాళ్ళ స్వంత మనిషిని పంపమను. డబ్బు అతనికిచ్చి పంపుతా నన్నానని జమీందారుగారితో చెప్పు.

మర్నాడు ఏడుగంటలకల్లా ఏనుగ వచ్చింది. దాని పేరు 'దులారి'. స్టాంపు అంటించిన రశీదు యిచ్చి జమీందారుగారి మనిషి పయికం పట్టుకు పోయాడు.

జయరాంబాబుగారింటికి ఏనుగు రాగనే చూద్దామని ఊళ్లో పిల్లలందరూ పోగయారు. ఒకళ్లిద్దరు కొంటె పిల్లలు 'ఏనుగమ్మ ఏనుగు-నెత్తిమీద పీనుగు' అంటూ అరవటం మొదలు పెట్టారు. అది విన్న జయరాంబాబుకు కోపంవచ్చి పిల్లల్నందర్నీ బయటికి వెళ్ళగొట్టించాడు.

ఏనుగ వెళ్ళి జనానా గదిముందు నుంచుంది. చాల కాలం క్రిందటే ప్లీడరుగారి భార్య స్వర్గస్తురాలయింది. పెద్దకోడలు భయపడుతూ మెల్లిగా అడుగులు వేసుకుంటూ

ఒక గ్లాసుతో నీళ్ళు తెచ్చి ఏనుగు పాదాలమీద పోసింది. మావటివాడు సౌంజ్ఞ చేయగా అక్కడ కూర్చుండి పోయింది. ఆమె ఏనుగు ముఖాన్ని గంధసింధూరం బొట్టుపెట్టింది. ఓ చిన్న కుర్రాడు శంఖం ఊదాడు. తరువాత ఏనుగ లేచి నుంచుంది. ఒక చాటలో బియ్యం, అరటిపళ్ళు మొదలైన మంగళకరమైన వస్తువులు ఉంచి దానిముందు పెట్టారు. అది తొండముతో తీసుకుని తిన్నన్ని తిని మిగతా వాటిని తన వంటినిండా చిమ్ముకొంది. ఈ విధంగా ఏనుగు క్రొత్తగా వచ్చినప్పుడు జరిగింది. రాజాగారి ఏనుగును పంపితే కట్టి వేసేందుకని బాగుచేయించిన స్థలంలో దూలారిని కటి వేయించారు. రాజాగారి ఏనుగ వస్తుందని తెప్పించిన ఆహార పదార్థాలన్నీ దులారీపాల బడ్డాయి.

పురవా పెండ్లికి వెళ్ళి వచ్చాక రాజా శ్రీ కోస లేశ్వర సింహుని కలుసుకోటానికి జయరాంబాబుగారు, ఏనుగుమీద వెళ్ళారు. మేడ రెండవ అంతస్థులో రాజులంగారి ఆఫీసుఉంది. కచ్చేరీలో కూర్చుని చూస్తే రాజబాటలో వచ్చే పోయేవాళ్ళంతా కనిపిస్తారు. ఏనుగరావటంకూడా వారు చూచారు. జయరాంబాబు ఆఫీసులోకివచ్చి రాజా వారికి నమస్కారంచేసి కూర్చున్నారు. రాజావారు తమ దావాల విషయంలో కొంత మాట్లాడిన తరువాత జయరాం బాబుగార్ని 'ఇది ఎవరి ఏనుగ?' అని అడిగారు.

ప్లీడరుగారు వినయంగా 'ప్రభువువారిదే' అన్నాడు.

రాజాగారు ఆశ్చర్యంగా 'నాదా? దీన్ని ఎప్పుడూ చూడలేదే! ఎక్కణ్ణుంచి వచ్చింది?'

'నే నే కొన్నాను. సోనాపూర్ జమీందారుగారి వద్ద'

'మీరు కొన్నారా?'

'అవును'

'మరి దీన్ని మీరు నా ఏనుగన్నారు?'

వినయంకొద్ది అన్నాడో వెక్కిరింపుకొద్దీ అన్నాడో అర్థం కాదుగాని, 'నేను మీ వాణ్ణయినప్పుడు నేను కొన్న ఆ ఏనుగుమట్టుకు మీదికాదూ?' అన్నాడు జయరాంబాబు.

సాయంత్రంకు ఇంటికి తిరిగివచ్చి స్నేహితులందరి మధ్యా కూర్చుని తనకూ జమీందారుగారికి జరిగిన సంభాషణ అంతా చెప్పి తనకు లోగడ కలిగిన అవమానం, సిగ్గూ, నివృత్తి అయినట్లు సంతృప్తిపడ్డాడు. ఇన్నాళ్ళకు ఈనాడు ఆయనకు సుఖంగా నిద్రపట్టింది.

## 4

పై ఘటన జరిగి అయిదు సంవత్సరములయింది. ఈ అయిదు సంవత్సరాలలోనూ ముక్త్యార్ జయరాం బాబుగారి పరిస్థితులుకూడా తారుమారయాయి. కొత్త రూల్సు ప్రకారం ఇంగ్లీషు చదువుకున్న ప్లీడర్లే ప్రతి కోర్టులోనూ తయారయారు. పాతకాలంనాటి ప్లీడర్లకు నానాటికి గౌరవంతో బాటు ఫైలుకూడా తగ్గుతూ వస్తోంది. అందువల్ల ముక్త్యార్ జయరాంబాబుగారి ఆదాయం

నానాటికీ తగ్గుతూ వచ్చింది. ఇదివరకు వచ్చే ఆదాయంలో ఇప్పుడు సగంకూడా రావటం లేదు. కాని ఖర్చుమట్టుకు రోజు రోజుకూ పెరిగిపోతోంది. ఆయన ముగ్గురు కొడుకుల్లోనూ మొదటి యిద్దరూ వట్టిమూర్ఖులు. వంశవృద్ధి చేసేందుకు తప్ప ఇంకెందుకూ పనికిరారు. మూడవవాడు హైస్కూల్లో చదువు కుంటున్నాడు. ఈ కుర్రవాడన్నా ఏమైనా వృద్ధిలోకి వస్తాడేమోనని తండ్రి ఆశ.

తన వృత్తిమీదకూడా ముక్త్యార్ జయరాంబాబుకు రోత పుట్టింది. తాను చూస్తూ ఉండగానే తనముందు దిశ మొలతో తిరిగిన మొన్న మొన్నటి కుర్రవాళ్ళు తనముందే కోర్టులో నుంచుని తనకు రాని ఇంగ్లీషు భాషలో ఏదో చెప్పుతూన్నప్పుడు తన జూనియర్ వకీల్‌ను ఎదటివాళ్ళు ఏమి చెపుతూన్నది, అడిగి తెలుసుకోవలసి వస్తోంది. అతడు అనువాదంచేసి చెపుతూన్నప్పటికే ఆ ఎదుట ప్లీడరు యింకా కొన్ని విషయాలు చెప్పెయ్యటం గలుగుతున్నది. ఈ విధంగా కాల వ్యవధిలేక పోవటంవల్ల తన ఆర్గ్యుమెంటులో తాను చెప్ప వలసిన విషయాలు కొన్ని వదలి వేయటం జరుగుతోంది. అందువల్ల వ్యర్థంగా ఆ యెదుటి ప్లీడరువేపు కోపంగా చూస్తూ ఉండిపోవలసి వస్తోంది. ఇదివరకు వచ్చిన అధికారులు జయరాంబాబును చాలా గౌరవంగా చూచేవారు. ఇప్పటివారు ఇంగ్లీషురాని వాడని ఆయనను చాలా చిన్న చూపున చూస్తున్నారు. ఈ కారణాలవల్ల యింక తన వృత్తినుంచి విరమించుకుందామనుకున్నారు. ఇన్నాళ్ళనుంచి సంపాదించిన డబ్బుమీద వచ్చే వడ్డీతో ఏదో విధంగా సంసారం గడుపుకుందామని ఆయన ఆశయం. దాదాపు

అరవై సంవత్సరాలు వచ్చాయి. ఎప్పుడూ ఒకే మాదిరి జరుగుతుందా, ఎల్లకాలం తానే సంపాయించటం కష్టంగదా? పెద్దవాడు అక్కరకు వచ్చినట్లైతే యేనాడో తాను విశ్రాంతి తీసుకునేవాడు. ఇక కష్టపడలేను. కృష్ణా! రామా! అనుకుంటూ యిక యింట్లో కూర్చుంటాను అంటూనే ఇంకో యేడాది దాకా వృత్తినుంచి విరమించలేక పోయాడు.

ఈ పరిస్థితిలో ఒక ఖూనీ కేసు వచ్చింది. అందులో ముద్దాయి తన తరఫున జయరాంబాబును ప్లీడరుగా నిర్ణయించుకున్నాడు.

మూడు రోజులు కేసు నడిచింది. ఆఖరిరోజు జడ్జీగారిని ఎసెసర్లనూ ఉద్దేసించి జయరాంబాబు తన ఆర్గ్యుమెంటు పూర్తిజేశారు. ఎసెసర్లు జయరాంబాబుకు అనుకూలంగా అతని పార్టీని నిర్దోషని అభిప్రాయం తెలిబుచ్చారు. జడ్జీగారు కూడా దాంతో ఏకీభవించి, ముద్దాయిని నిర్దోషని విడుదల చేశారు. జడ్జీగారికి నమస్కారంజేసి జయరాంబాబు బయటికి వచ్చేస్తుండగా జడ్జీగారు గుమాస్తాను 'ఈ వకీలుగారి పేరేమిటి?' అని అడిగారు.

'జయరాంబాబువకీలుగాదు. ముక్త్యారీ ప్యాసయాడు.'

జడ్జీగారు జయరాంబాబును చూచి 'మీరు ముక్త్యారా?' అన్నారు.

'మీరు కేసు నడపిన పద్ధతిజూస్తే చాలా పెద్దవకీ లను కున్నాను.'

ఈ మాట జడ్జీగారనేప్పటికి జయరాంబాబుకు మహదానందం గలిగింది. రెండు చేతులూ జోడించి, వణుకు

తున్న గొంతుకతో 'కాదు! నేను వకీలును కాదు. మామూలు ముక్త్యారునే. అందులోనూ పూర్వకాలపు ముక్త్యారును. ఇంగ్లీషు ఏమీ రానివాణ్ణి. ఇవాళ తమరు నా గౌరవాన్ని నిలబెట్టారు. నా జీవితంలో ఎప్పుడూ ఈ సంగతి మరచిపోను. మీరు హైకోర్టు జడ్జీలు కావాలని భగవంతుని గూర్చి ప్రార్థిస్తాను. అని పునః నమస్కారం జేసి కోర్టునుంచి బయటికి వెళ్ళిపోయారు.

ఆ నాటినుంచి జయరాంబాబు మళ్ళీ కోర్టు ముఖం చూడలేదు.

# 5

జయరాంబాబు ముక్త్యారీ మానేసిన తరువాత చాలా కష్టంగా కాలం గడుపుతున్నారు. ఆయన అనుకున్న ప్రకారం ఖర్చు తగ్గించుకునేందుకు వీలు కావటంలేదు. వడ్డీతో సరిపెట్టుకునేందుకు కుదరటంలేదు సరేగదా అసలులోకూడా ఖర్చు చెయ్యాల్సి వస్తోంది.

ఒక రోజు ఆయన ఆఫీసు గదిలో కూర్చుని తన పరిస్థితిని గురించి ఆలోచించుకుంటున్నాడు. ఆ సమయంలోనే మావటివాడు దులారీని స్నానం చేయించేందుకు చెరువుకు తీసుకు పోతున్నాడు. చాలా రోజులనుంచి ఈయన స్నేహితులంతా 'ఏనుగు ఎందుకూ? అమ్మివేసెయ్యరాదు? నెలకు ముఫ్పై, ముఫ్పై అయిదు రూపాయిలు కలిసి వస్తాయి. అన్నారు. ఆ మాటవిని 'మీ బిడ్డలే ఉన్నారనుకోండి.

వాళ్ళకు రోజూ తిండికి ఖర్చవుతోందని మీలో ఎవరన్నా అనుకుంటున్నారా? వాళ్ళ నమ్ముకుంటున్నారా?' మళ్ళీ ఎవరూ ఏజవాబు యివ్వకుండానే ఊరుకుండి పోయారు. ఆలోచించగా ఆలోచించగా ముక్త్యారుగారికి ఓ ఉపాయం తోచింది. ఏనుగను అద్దెకు యిస్తూంటే కొంత డబ్బయినా వస్తూంటుంది. కొంతమేతా కలిసి వస్తూంటుంది అనుకుని ఒక కాగితం తీసి ఒక నోటీసు వ్రాశారు.

## అద్దెకు - ఏనుగు

పెండ్లి ఊరేగింపులకు, దూరపు ప్రయాణాలకు, మా 'దులారీ' అనే ఏనుగును అద్దెకు పంపుతాము. రోజుకు అద్దె మూడురూపాయిలు, మేతఖర్చు రూపాయి, మావటివాడి ఖర్చుకు అర్ధరూపాయి మొత్తం నాలుగు రూపాయిలన్నర. కావలసినవారు నాతో స్వయంగా మాట్లాడినా సరే, లేక ఉత్తరం ద్వారా అడ్వాన్సుపంపినా సరే పంపించబడును.

జయరామ్‌దాస్ (ముక్త్యార్)
మిసిర్ లేన్ - రాయ బెరిల్లీ.

ఈ విధంగా అచ్చువేయించి లాంతరు స్తంభాలికి, ఇంటి తలుపులకు, రోడ్డు ప్రక్కన ఉన్న చెట్లకూ బహిరంగ స్థలాలలోనూ అంటింపించారు. ఇంకా ముఖ్యమైన వూళ్ళల్లో చుట్టుప్రక్కలా పంచిపెట్టించాడు. ఈ విజ్ఞప్తిచూచి అప్పు డప్పుడూ ఏనుగును అద్దెకు తీసుకు పోతూండేవారు. అందు వల్ల పదిహేను-యిరవై రూపాయిలకంటె ఎక్కువ అద్దె రావటం లేదు.

ఒకసారి ముక్త్యారుగారి పెద్ద మనుమడికి జ్వరం వచ్చింది. రోజుకు డాక్టరుకు మందుకు అయిదారు రూపాయిలు ఖర్చయ్యేవి. ఒకనెల ఈలా గడిచిన తర్వాత నయమయింది. కుర్రవాడి పరిస్థితి బాగుపడింది.

రెండవకోడలూ, మూడవకోడలూ గర్భవతులుగా ఉన్నారు. కొద్ది రోజుల్లోనే ముక్త్యారుగారికి మరి రెండు ప్రాణాలకు ఆహారవసతులు ఏర్పాటు చేయించవలసిన అవసరం కలుగుతుంది.

పెద్ద మనుమరాలికి పన్నెండోఏడు వచ్చింది. పైగా కాలుపొడుగుపిల్లకూడాను! తొందరలోనే ఆ పిల్లకు పెళ్లి చెయ్యాలి. ఆమెకోసం ఎన్ని సంబంధాలు వెతికినా ఒక్కటి కూడా మంచిది కనుపించలేదు. ఏదో ఒకటి, అదా, కనపడ్డా విపరీతమైన కట్నాలు అడుగుతూ వచ్చారు.

పిల్లతండ్రికి ఈగొడవ పట్టలేదు. అతడికికావల్సిందల్లా సిగరెట్లూ-చీట్లాటా; తప్పితే హార్మోనియంమీద ఓపికున్నంత వర్కూ వాయించటం. అంతే. ఈ ఇంట అందరివీ, అన్ని బాధ్యతలూ ఈ అరవై సంవత్సరాలు దాటిన వృద్ధుడిమీద వచ్చిపడ్డాయి!

చివరకు వెదకి వెదకి ఓ సంబంధం స్థిరపర్చుకున్నారు. పిల్లవాడు యం. ఏ. చదువుతున్నాడు. అన్నవస్త్రాలకు లోటు లేదు.

రెండువేల రూపాయిలు నగదు కట్నం. అయిదువందల రూపాయిల ఆభరణాలు పిల్లకు పెట్టాలని పిల్లతండ్రి కోరాడు.

ఎలాగయితేనేం ఈ రెండువేల అయిదువందల రూపాయిలకు వప్పుకుంటే మనుమరాలి పెళ్ళి గౌరవకుటుంబపు పిల్లవాడితో అవుతుందని తృప్తిపడ్డాడు.

దాచిపెట్టిన నోట్ల కట్టలు రోజు రోజుకి తరిగిపోతు న్నాయి. వాటిలోంచి యిరవైఅయిదువందలూ తియ్యటం చాలా కష్టమనిపించింది. ఈ ఒక్క మనుమరాలే కాదు. ఇంకా ఉన్నారు. వారి గతేంగాను? ఈ ఆలోచనతో ముక్త్యారుగారు బెంగపెట్టుకుని నానాటికి కృశించిపోసాగారు. ఇలాటి సమయంలోనే చిన్నకొడుకు బి. ఏ. ఫెయిల్ అయ్యా డన్న వార్త తెలిసింది. స్నేహితులంతా ఏనుగును అమ్మే య్యండి. దాన్నమ్మినడబ్బుతో మనుమరాలి వివాహం చెయ్యండి. పరిస్థితులనుబట్టి నడుచుకోవాలి. మమకారం పెట్టుకుంటే ఎలా కుదురుతుంది. వేరే మార్గం లేనప్పుడు ఏంచేస్తాం? అనసాగారు. ముక్త్యారుగారు ఏమీ జవాబు చెప్పేవాడుకాదు. తలకాయ వంచుకొని ఏదో ఆలోచిస్తూ కూర్చునేవాడు.

'చైత్రమాసంలో ఢాలామపూరులో ఒక పెద్ద సంత జరుగుతుంది. దానికి చాలా ఆవులు, గుఱ్ఱాలు, ఒంటెలు, ఏనుగులూ మొదలైన వెన్నో అమ్మకానికొస్తాయి. ఏనుగును సంతకు పంపించండి. రెండువేలకు కొన్నారు. ఇప్పుడు పెద్ద దయింది. మూడువేలరూపాయిలు చులకనగా వస్తాయి' అని కూడా చెప్పారు.

'ఇలా ఎలాచెప్పగలుగుతున్నారు మీరు?' అని కంట నీరు పెట్టుకున్నాడు జయరాంబాబు. మళ్ళీ స్నేహితులు

అందుకుని నా కడుపున పుట్టిన బిడ్డను పెంచినట్లుగా పెంచుకున్నానని మీరే అంటున్నారు. మీరేచెప్పండి. ఆడపిల్లను పెంచి ఎప్పుడూ ఇంట్లో ఉంచుకుంటామా? పెళ్ళిచేసి అత్తవారింటికి పంపుతాము. ఇంతకూ మనకు మిగిలేది మమకారం మాత్రమే. అదేవిధంగా దీన్నికూడా ఎక్కడన్నా సుఖపడే చోటు చూచి అమ్మండి.

'సరే. మీరంతా చెబుతూంటే నేను కాదనటం ఎందుకు. మీరే సంతకు పంపించి ఎవరికో చూచిఅమ్మండి. రెండు మూడు వందలు తక్కువ వచ్చినా సరే మంచిచోటు చూచి అమ్మండి.'

సంత పదిహేనురోజులు జరుగుతుంది. కాని చివర అయిదారురోజుల్లోనే జనం ఎక్కువ వస్తారు. అందుకని మొదటి అయిదారురోజులు జరిగాకనే ఏనుగను సంతకు తోలుకు వెళ్ళేందుకు ఏర్పాటు చేయించారు. ఏనుగతో మావటివాడు, ముక్త్యారుగారి రెండోకొడుకు వెళ్ళేందుకు నిర్ణయించారు.

ఏనుగను పంపించేరోజున జయరాంబాబు చాలా పెందరాళే లేచారు. ఏనుగును తోలుకెళ్లేముందు దాని కడుపునిండా దాని ఇష్టమైన మేత స్వయంగా పెట్టాడు. అది వెళ్ళిపోతోందంటే ఇంట్లో ఆబాలగోపాలం కంటతడిబెట్టారు. పావుకోళ్ళు తొడుక్కొని జయరాంబాబుకూడా అక్కడే నిల్చున్నాడు. ఆక్రితంరాత్రి రెండురూపాయిలుపెట్టి లడ్డూలు తెప్పించారు. మేతంతా తిన్నాక లడ్డూలుకూడా తానే స్వయంగాపెట్టి దాని మెడక్రింద నిమురుతూ 'దులారీ' సంత

చూచిరా.........ఆపైన ఆయనకు మాటరాలేదు. కంఠం రుద్ధమయింది. కంటినిండా నీళ్ళు కమ్మాయి.

ఏనుగ వెళ్ళిపోయింది. ముక్త్యారు జయరాంబాబు శూన్యహృదయంతో కచ్చేరీ సావిడిలోకి వెళ్ళి చాలాసేపటి వరకూ బల్లమీద పడుకున్నారు. బలవంతంమీద లేచి వెళ్ళి స్నానంచేసి భోజనానికి కూర్చున్నాడేగాని ఒక్క మెతుకైనా ముట్టుకోలేదు.

## 6

మనుమరాలి వివాహసంబంధం స్థిరపడింది. ఆ జేష్ట శుక్లదశమికి వివాహ లగ్నం పెట్టుకున్నారు. వైశాఖ మాసంలో తాంబూలాలు పుచ్చుకుంటారు. ఏనుగు అమ్ముడు పోయిన డబ్బు రాగానే నగలు చేయిస్తారు.

కాని వైశాఖ బహుళ పాడ్యమినాటికి 'దులారి' తిరిగి వచ్చింది. అది అమ్ముడుపోలేదు. అంత ధరపెట్టి కొనేవాడే లేకపోయాడు. 'దులారీ' తిరిగిరావటాన్ని చూసి ఇంట్లో అంతా సంతోషించారు. అది అమ్ముడుపోలేదనే విచారం ఎవరికీ లేదు. పోయినడబ్బు తిరిగి దొరికినట్టుగా ఉంది అందరికి. పైగా అయ్యో! బాగా చిక్కిపోయింది. మేత సరిగా దొరక లేదుకాబోలు. కొన్నాళ్ళు బాగా మేపాలి. అన్నారు ఇంట్లో అందరూ!

మనుమరాలి వివాహం జ్ఞాపకానికి రాగా వివాహం ఎట్లా చెయ్యటమూ? అన్న ఆలోచన వచ్చి ఇంతవరకూ జయరాంబాబుకు ఆవరించిన ఆనందాన్ని దిగమ్రింగింది.

పై సంత అయిపోయింతరవాత రసూల్ గంజిలో మరొక సంత అవుతుంది. ఆ సంత వారంరోజులు జరుగుతుంది. మొదటిసంతలో అమ్ముడుపోని పశువులు ఆ సంతకు పంపుతారు. మిత్రులంతా మళ్ళా పోగయారు. 'ఇంత పెద్ద సంతలో దీన్ని కొనేవాడే లేకపోయాడా?' అని అందరూ ఆశ్చర్యపోయారు. అందులో ఒకరు 'దులారీ! సంత చూచిరా' అని జయరాంబాబు ఏనుగుతో వెళ్లేరోజున అన్నారు. అలాగే జరిగింది. పెద్దలమాట వృథాగాపోతుందా? అన్నాడు. అయినా రసూల్ గంజి సంతకూడా పంపించి చూడమని సలహాయిచ్చారు.

'దులారీ' మళ్ళీ యివాళ సంతకు వెళ్లుతుంది. ఇవాళ వృద్ధుడు దానిదగ్గర నుంచోలేకపోయాడు. దగ్గరకుకూడా పోలేకపోయాడు. మేతపెట్టించి దులారీని సంతకు తోలుకెళ్లారు. అది వెళ్ళాక మనుమరాలువచ్చి 'తాతయ్యా! దులారీ వెళ్ళేటప్పుడు ఏడుస్తోంది' అంది.

'అవును ఏడుస్తుంది. వెళ్ళేటప్పుడు బొట బొట కన్నీరు కార్చింది. తెలిసింది. ఏనుగకు దివ్యదృష్టి ఉంది కాదూ! మళ్ళా ఇంటికి రానని తెలుసుకుని ఏడుస్తూ వెళ్లుతోంది' అని దుఃఖంతో అన్నాడు.

మనుమరాలు వెళ్ళిపోయాక వృద్ధుడూ తనలోతాను విలపిస్తూ 'నువ్వు వెళ్ళేటప్పుడు నీదగ్గరకు రాలేదు. నిన్ను

అవమానించేటందుకు అనుకోలేదుగదా! బిడ్డా! కాదుకాదు! నువ్వు అంతర్యామివి. నా మనస్సు తెలుసుకునే ఉంటావు. మా బిడ్డ వివాహం అవుతుంది. అయాక నువ్వు ఎక్కడవుంటే అక్కడకు వచ్చి చూచివద్దామనుకున్నాను. వచ్చేటప్పుడు నీకు మిఠాయి, జిలేబి, లడ్డూలు తీసుకువస్తాను. నేను బ్రతికి ఉన్నన్నాళ్ళు నిన్ను మరిచిపోను. అప్పుడప్పుడు వచ్చి ఎప్పటి కప్పుడు చూచిపోతూ ఉంటాను. ఏమీ అనుకోకు' అని తనలోతాను గొణుగుకుంటూ వాపోయాడు.

## 7

ఆ మరునాడు మూడవఝాము వేళ ఒకమనిషి ఏదో ఉత్తరం తెచ్చి ముస్త్యారు జయరాంబాబుగారికి ఇవ్వమని ఇంట్లో ఇచ్చాడు. వుత్తరం చదువుతోండగానే వృద్ధుడినెత్తిన పిడుగుపడ్డట్లయింది. దులారీని తోలించుకు వెళ్ళిన తన రెండవ కొడుకు వ్రాసింది ఆవుత్తరం. అందులో—

'ఇంటివద్ద నుంచి దులారీతో బయలుదేరి నిన్న మధ్యాహ్నంకు యిక్కడకు వచ్చాం. మనఊరు యిక్కడకు సరిగా ఏడు క్రోసులుఉంది. ఇక్కడకు రాగానే దులారీకి చాలా జబ్బు చేసింది. నడవలేని స్థితిలోఉంది. దారి ప్రక్కన ఒక మామిడిచెట్టు క్రింద పడుకుని ఉంది. కడుపునొప్పివల్ల బాధపడుతోంది. అప్పుడప్పుడూ తెరలు తెరలుగా నొప్పి

వచ్చినప్పుడు తొండ మెత్తి ఆర్తనాదం చేస్తోంది. మావటీడు తనకు చేతనైన వైద్యమంతా చేశాడు. కానీ, ఏమీ లాభం కనిపించటంలేదు. బ్రతుకుతుందనే ఆశలేదు. బ్రతకకపోతే దగ్గరలోనే పాతిపెట్టించే ఏర్పాటు చేసుకోవాలి. గాన మీరు వెంటనే బయలుదేరి రండి' అని ఉంది.

ఇది చదివి వృద్ధుడు ఏమీం తోచక పిచ్చివాడివలె ఇంట్లోకి బయటికి తిరుగుతూ! 'బండి కట్టించు. ఇప్పుడే వెడతాను. దులారీకి జబ్బుగా ఉంది. చాలా బాధపడుతూన్నదట. నేను చూస్తేనేగాని కాదు కాదు నన్ను చూస్తేనేగాని దానికి సుఖముండదు. ఆలశ్యం చేసేందుకు వీల్లేదు' అన్నాడు.

వెంటనే బండికోసం నౌకరు పరుగెత్తాడు. రాత్రి పదిగంటలకు బండి ఎక్కి బయలుదేరాడు వృద్ధుడు. అతని వెంట పెద్దకొడుకు ఉత్తరం తెచ్చిన మనిషి వెళ్ళారు.

మర్నాడు జయరాంబాబు అక్కడికి వెళ్ళేటప్పటికే 'దులారి' పరలోకానికి వెళ్ళిపోయింది.

దాన్ని చూచి వృద్ధుడు దుఃఖభారంతో అంతదూరం నుంచి పరుగెత్తికెళ్ళి దాని శవాన్ని ఆలింగనం చేసుకున్నట్లుగా మీదపడిపోయాడు. దాని ముఖంవద్ద ముఖంపెట్టి ఏడుస్తూ కోపంవచ్చి వెళ్ళిపోయావా బిడ్డా ! 'నిన్ను అమ్మేసేందుకని పంపించాను. అందుకని కోపంవచ్చి నన్ను విడిచి వెళ్ళిపోయావా బిడ్డా !' అంటూ విలపించాడు.

* * * *

'దులారీ' మరణించినతరువాత మరి రెండు మాసముల వరకు మాత్రమే ముక్త్యారుగారు జీవించియున్నారు. తన ప్రతిజ్ఞ ననుసరించి, దులారీ యెవరియింటికి వెళ్ళిందో వారియింటికే తానూ వెళ్ళాడు. కానీ వాగ్దానప్రకారం లడ్డూ, జిలేబీలు తీసుకువెళ్ళ లేకపోయాడు. బహుశా ఆ రాజ్యంలో జిలేబీలు, లడ్డూలకంటె అనేకలక్షల రెట్లు మధురమైన - రుచికరమైన పదార్థాలు వుంటాయనే ఆశయంతో అయివుండవచ్చు.



ఏ. జీ. ప్రెస్, విజయవాడ.